# సార్వభౌములు

**KOPPARTY BHANUMURTY GARU**

*Headmaster, Mission Middle School Narsapur*



PUBLISHERS

**SAHITY NIKETAN**

**NARSAPUR.**

# సార్వభౌములు

[illegible]

[illegible]

[illegible]

[illegible]



ప్రకాశకులు

సాహితీనికేతనము

నరసాపురము.

1931

[illegible] [ వెల 0—12—0

# OPINIONS.

## M.R.Ry., Kuchi Narasimham Pantulu Garu

### RETIRED HEADMASTER, PITHAPURAM.

I have read with pleasure the first 80 pages of "SARVABHAUMULU" sent to me specimens by its author, Mr. Kopparti Bhanumurty for opinion. The contents seem to be brief prose sketches in Telugu of the lives of the six illustrious Emperors of ancient India. They are instructive and interesting spiced with apt quotations, here and there, of exquisite verses from distinguished poets.

This being the very first production of the author, there are found a few small mistakes due perhaps to oversight and hasty proof reading, but side by side there are many evidences also of Mr. Bhanumurthy's future greatness as an author.

Manifestly Mr. Bhanumurty is fond of writing in the high learned style adopted by the late Chinnaya Soory garu and I heartily wish him every success in the line of his choice.

PITHAPURAM.
24 th. July 1929

**K. Narasimham,**
Retired Head master.

## టైలరు హైస్కూలు ప్రధానోపాధ్యాయులగు బ్రహ్మశ్రీ దర్భా జగన్నాథశాస్త్రిగారిచ్చిన యభిప్రాయము.

అయ్యా,

మీరు రచించిన 'సార్వభౌముల'ను గద్యకావ్యము నందు కొన్ని యందలి కథాభాగముల నచ్చటచ్చటఁ జదివి చూచినాఁడను. ప్రస్తుతమందుఁ బ్రచురితమైయున్న ప్రణాళిక (Syllabus) నుబట్టి పాఠశాలలం జదువువిద్యార్థుల పఠనీయగ్రంథముల శైలిపూర్వముకంటెఁ జాలకఠినముగా నుండవలసినట్లు కాన్పించుచున్నది. ఈ పొత్తమత్యుత్తమశైలినొంది నూతన ప్రణాళికానుసారముగా నున్నదని వాక్రుచ్చుట కెంతయు సంతసించుచున్నాను. ఇందలి కరుణాదిరస ప్రధానపుం బట్టులు కడుంగడు శ్లాఘాపాత్రములు. మఱియు నిందలి శబ్దార్థాలంకార భూయిష్ఠభాగంబులు చదువరులకు వీనుల విందులై, మనోరంజకములై యున్నవి. ఉన్నతపాఠశాలలలోని IV, V, VI ఫారముల బాలుర కత్యంతోపయోగకరమగుటంజేసి పాఠశాలాధికారులు తమతమ పాఠశాలలయందు దీనింబఠనీయ గ్రంథముగా వాడుచు నీ గ్రంథకర్తల కత్యంతోత్సాహము కలిగింతురని మిగుల నమ్ముచున్నాను.

నరసాపురం
26-7-29

దర్భా జగన్నాథశాస్త్రి.

శ్రీ జగన్నాథాయనమః

# సార్వభౌములు

## హరిశ్చంద్రుఁడు.

"సీ॥ హరిహరబ్రహ్మాదులద్భుతంబందంగ
నెగడె సత్యవ్రతనిష్ఠ కలిమి
నాలుగు యుగముల నోలిని బదునాల్గు
వరుసల వర్తిల్లి వసుధయేలె
సప్తపాథోధిసంగుప్తసప్తద్వీప
సంధులజయశిలాస్తంభవితతి
నిలిపె నాఖండలాదులు పంపుసేయంగ
రాజసూయ మహాధ్వరం బొనర్చె
గీ. సతలవితల రసాతలాద్యఖిల దనుజ
లోక గంధర్వలోకాహిలోక నాక
లోక గోలోక కమలజలోకభరిత
సాంద్రయశుఁ జెప్పఁదగు హరిశ్చంద్రవిభుని."

సత్యము పరబ్రహ్మస్వరూపము. జగదుద్భవస్థితి లయ
కారణము. సకలపురుషార్థ సాధనము. ఘోరపాపాటవీదా

నారదుని దేహంబు గోఁకె. మాండవ్యుఁడు శౌండిల్యునిఁ జూచి కనుసన్న యొనర్చె. ఇట్లొకరి నొకరు "నీవు! నీవ"ని యొండొరులఁ బురికొల్పుకొనుచుండఁ దత్సభాస్థలిఁ గల కలంబు వారింపఁ దలఁచి నిక్కము వక్కాణింపనెంచి సకలమునిగణ శ్రేష్ఠుఁడగు వసిష్ఠుఁ డాసనమునుండి దిగ్గనలేచి "ఓపాకశాసనా! సూనృతవచశ్శ్రీవైభవోపేతుఁడగు భూకాంతుఁ డొక్కఁడు గలఁడు. అతఁడు నవ్వులకైనఁ గలనైన బొంకి యెఱుంగని నిత్యసత్యవ్రతుఁడు" అని నుడివిన విని విశ్వామిత్రుఁడు బూర్వవైరాగ్ని జ్వాలలాకసంబు ముట్టఁ బ్రతిరవమిచ్చు సింగంబు పగిది నిష్ఠురోక్తులఁ బల్కఁ దలఁచి "వసిష్ఠా! కుత్తుకబంటిదాఁక మాంసము మెసవి యవసర సమయంబులను, బరరాష్ట్రాపహరణ వేళలయందును నిచ్చవచ్చిన మచ్చున మాటలాడి కార్యానుకూలము గావించుకొను రాజులా నిత్యసత్యవ్రతులు. భూపతులెక్కడ? సత్యాలాపము లెక్కడ? నక్కలెక్కడ? మాయావిహీన ప్రవర్తనములెక్కడ? చాలు! చాలు! నారాజెవలో" చెప్పుమని గద్దించి పలికెను.

వసిష్ఠుఁడు వాని వాక్యంబుల కలుగక వికవికనవ్వి "దేవేంద్రా! ఆరాజు మాహరిశ్చంద్రుఁడే" యని వచించెను. "బళిరే! నీవేమో వాని పురోహితుఁడ వగుటంబట్టి వెనుక వేసికొనివచ్చి త్రివ్వి తలకెత్తిన నిన్నుఁగూడ నాతఁడు త్ర

వ్వి తలకెత్తునని తలఁచి యింతటి సభలో మంచిచెడ్డలర యక యవిశ్వసనీయ వాక్యములఁ బల్కెదవా! ఎవ్వరైన నవ్వి పోదురని లజ్జించియైన నింక నూరకుండుమ"ని గాధే యుఁడు వానిం దూలనాడిన వసిష్ఠుండు గనలి "ఓయీ! మంచిచెడ్డ లారయక యీదేవేంద్రసభనిట్టి ప్రల్లదంబులు పలుకఁ బాడియే? భానువంశసుధాబ్ధి శశాంకుని, గుణధా ముని, సూనృతోక్తి మణిమండనుని, హరిశ్చంద్రుని నీవొక రాజమాత్రునిగా, సామాన్యమానవునిగా నెన్నుచుంటివిగా! పోనిమ్ము! నీవు నిందించిన మాత్రమున వానియశోగుణ ప్రభావసత్యమహిమంబులకుఁ గొఱంతయే? కుక్క మొఱిఁ గిన మాత్రమున జంగము పరపతి పోవునొక్కో? శివ! శివ! వానిని దూషించినఁ బంచమహాపాతకము లీక్షణంబునఁ జుట్టుకొనును" అని గంభీరముగాఁ బలికె.

గాధేయుఁ డహంకారపూరితుఁడై "ఓరీ! వాచాటా! ఎవనినో రాజాధముని, మాంసాహారుని, మదోన్మత్తునిఁ, బుచ్చకాయకుఁ, జేవదెచ్చునట్లు, నీరుల్లికి సువాసనగలుగఁ జే యురీతి, వేమునకుఁ దియ్యందనం గూర్చు తెఱంగున వంది వలె వానినిఁ గీర్తించుచుఁ జేవదేఁ జూచుచుంటివి! హరి శ్చంద్రుండు నే నెఱుఁగని వాఁడా! అతఁడెక్కడ? సత్యవ చో విస్ఫురణమెక్కడ? ఏదో కొంప మునిగినట్టు లిందఱు మునీంద్రులుండ నిర్జరానీక మజ్జారే! యని మెచ్చునట్లు

వింధ్యాద్రిగర్వమ్ము సర్వమ్ము వమ్ముచేసిన యగస్త్యుఁ డూరకుండ, నింద్రునంతవానినిఁ గోపాధవీక్షణుఁడై యొడలెల్లఁ గన్నులుగాఁ జేసిన గౌతముఁ డూరకుండ, వేదంబులెల్ల విడఁదీసి యచ్చుగట్టిన వ్యాసుండు నూరకుండ శివుని నెదిరించి యఱకాలఁ గన్ను చూపిన భృగుమహర్షియు నూరకుండ రాచపాచికత్వమునఁ బొట్టపోసికొను నీవు తగుదునమ్మా యని గర్వంబున నిట్లుందఱ నవమానించి ప్రేలెదవా?" యని నోటికివచ్చినట్లు పలికెడు గాధిజుఁగాంచి విపుల తపోగరిష్ఠుండగు వసిష్ఠుఁడిట్లనియె. "ఓయీ! ఇన్ని యేల? పూజ్యమైన సామ్రాజ్యలక్ష్మి వాసినను, కులవధూత్త్మంసంబు వర్జించినను, వంశవర్ధనాంకూరంబగు ప్రియతనయుం డీల్గినను, హీనకృత్యములచేత దుర్ధశాంభోనిధి మున్గినను వనటం జెందినను నాహరిశ్చంద్రుఁ డనృతమాడు వాఁడుకాఁడు. నీవా యధిపుచే నసత్య మాడింతువేని జపతపంబులఁ ద్యజించి బోడినై బూదిమేననలంది, మనుజకపాలపాణినై, ఖరవాహన మెక్కి యామ్యదిశకుఁ బోయెద.

గాధేయుఁడు మండిపడుచు "దుష్టా! వసిష్ఠా! ప్రతిజ్ఞామాత్రంబున నన్ను భయపెట్టఁ దలంచితివా! నీపాటి శపథంబు నేను చేయలేనా? వృథాప్రసంగములు శుష్కప్రతిజ్ఞలు నేల? ఏవిధమునసైనఁ గపట నాటకము నాడించి యాతనిఁ జపలచితునిఁ జేసి యసత్యముఁ బల్కించి తీరెద. నే

నట్లు బొంకించి నిన్నోడింపలేకున్న నాభుజగభూషణునిఁ గూర్చి యొనర్చిన తపంబున సగమా సార్వభౌమున కొసంగి వానినా యిందుని నగ్రాసనమునందుండఁ జేసె పదునాల్గు మన్వంతరములదాఁక నీస్వర్గంబ నర్ధశంబుగ నాతఁడేలునట్లొనర్చెద" నని బిగ్గఱగాఁ బ్రతిశపథంబు చేసెను.

కుంభిని కుమ్మరిసారెభంగి దిర్దిరం దిరిగె. దిగ్దంతులొరిగె. సాగరములు కలఁగఁ బాఱె. పసులకు భయంబు గలుగఁ జేయు సురగవిభుండును దన వేయి కలల ముడుచుకొనియె. సునాశీరుండు ప్రకంపితదేహుండై సభ చాలించి లేచిపోయె. బృందారకబృందంబు కకావికలయ్యె. మౌనివరులందఱు గుసగుసమిక్కు మనకక్కడ నోమఁగుచుండిరి. తక్కుంగల వారలతి భీతులై యేమి ముప్పువాటిల్లనున్నదోయని నలిక్కులకును బాఱిరి.

గాధిజుఁడు వసిష్ఠునిఁజూచి "ఓరీ! మీసత్యవాక్యధురంధరుండగు హరిశ్చంద్రుని కడకేగి మునుగా వానిక నింధించి నీయత్నము నీవు చేసికొనుము. నేనిదే చని నాపని నెఱవేఱఁ జూచెద" నని హేళనచేసెను.

వసిష్ఠుండు సెలవివాఱనవ్వి "ఓయీ! సహజంబుగ నిముడని మందది యెంతసేపుండఁ గలదు. కప్పురమునకును బూవునకును బరిమళము పుట్టుకతోడనే పొడముటతీ హరిశ్చంద్రునకుఁ బుట్టుకతోడనే సత్యంబు జనించె. నిన్నుఁ బో

లు మును లెందఱు గుమిగూడి వాని మాయావన రాశి ముంపఁ జూచిన నాతఁడు మునుఁగువాఁడు కాఁడు. నేఁబో యి యీగాథలఁజెప్పి బోధింతునను కొంటివో! ఈ ప్రసం గ మెత్తితినేని గాయత్రికిఁ దప్పినవాఁడ నగుదు"నని గాయ త్రిఁబట్టి ప్రమాణంబు చేసెను.

విశ్వామిత్రుఁడు తట్టుకొనక్రోధ మానసుండై వెడలి పో యెను.

అది చైత్రమాసము. ఎల్లవారును దమతమ చిన్నారి పొన్నారి కన్నియలకు వడుగులకుఁ బెండ్లిచేయువారు ను త్సవంబు లూరూర నొనర్చువారునై యుండిరి. రసాలసాల ములు పువ్వులు కాయలచేఁ గ్రమ్మఁబడి యిది యాకు నిది ప్రమాఁకు నిదికొమ్మ యిదిరెమ్మ యని తెలియకుండనుండి సిరులంబొదలు వారివలెఁ గనుపండువు సేయుచుండెను. రా జులనేకులు యజ్ఞయాగాదిక్రతువు లాచరించి మహాదానం బు లొనర్చుచుండిరి. బహుయజ్ఞదీక్షా సమర్థుఁడైన హరి శ్చంద్రుఁడును యజ్ఞమొండొనరించెను. విశ్వామిత్రుఁ డది విని వాని తలఁపున కనుకూలమైన మిషగల్గెనని తలంచి హ రిశ్చంద్రుని కడకేగెను. రాజత్యంత సంతోషంబున ముని రాజు నెదుర్కొని యర్ఘ్యపాద్యాది పూజన మాచరించి యర్హాసనమున నునిచి తన వాంఛితంబేదియో తెల్పుమని వేఁడుకొనెను. విశ్వామిత్రుఁడు సంతసించి "హరిశ్చంద్రా!

నీవు నరరూపము దాల్చిన కల్పవృక్షమవు. వేల్పుటావు కడకేఁగి గిద్దెఁడు పాలడుగురీతిఁ బారిజాతము కడకేఁగియొక్క పుష్పమడుగునట్లు నీవంటి దానశౌండుని కడకు వచ్చి యొక యల్పదాన మడుగుచుంటి” ననిన “మునివర్యా! అవశ్యముఁ దీర్చెదనడుగుఁ డని నుడివిన “రాజా! అతి కుతుకంబున సితకరమౌళికిఁ గ్రతువొనర్ప మదిఁ దలంచితి. క్రతువునకు వలయు సామగ్రుల కైననేమి, దక్షిణల కైననేమి ముప్పదికోట్ల రూప్యంబులు వలయు” ననిన “మునిసత్తమా! మీరడిగిన విత్తంబునకుఁ జిత్తంబురంజిల్లె” నని సత్యకీర్తినిఁ బిలిచి యా మునివర్యునకుఁ గోశాగారమునుండి ముప్పదికోట్ల నాణ్యంబు లొసంగుమని యాజ్ఞాపించె. ముని మహాశ్చర్యము నొంది తదీయానూనదాన ప్రభావమునకు మెచ్చి “రాజేంద్రా! ఇటనుండి బ్రహ్మకపాలము, బదరీనారాయణము మొదలుగాఁ గలక్షేత్రంబుల కేఁగి యచ్చటి మునుల నాహ్వానించి తదవసరంబులగు సంభారంబులఁ గూర్పఁ బోవుచుంటి. ఇపుడీ ధనము నీయొద్దనే యుంచుము. మగిడివచ్చునప్పుడు వలయునప్పు డడిగి కైకొందునని వచించె. “విశ్వామిత్రా! ఎవరి సొత్తు వారికడనుంటయే మంచిదికదా! వాగ్దత్తంబైన విత్తంబు మాకేల? తీసికొని పొండ”ని రాజువేఁడుకొన “రాజా! నీవిచ్చిన ఫలమును నేఁ బుచ్చుకున్న ఫలంబును గూడలేదు. నాకుటీరమునం దెందైనఁ బడవైచి పో

వుచో ముప్పిచ్చులపహరించిన పిదపఁ జేయునదేమున్నది. కాన నీకడనే యుంచుము. అక్కఱ యొదవినవేళవచ్చి పుచ్చుకొనియెద" నని గాధేయుఁడు నమ్మఁ బలికి వెడలి పోయెను.

అంత నితాంతకపటక్రియాధౌరేయుండగు నగ్గాధేయుండు వెండియు హరిశ్చంద్రమండలాధిపు నుద్దండ బాధాతండంబులఁ ద్రోయఁ దలంచి యపూర్వంబును భయంకరంబు నగు కైతవ మృగఖగసంచయము గల్పించె. అయ్యవి పురంబులఁ జొచ్చి సస్యంబులమేసి, యారామముల నాశనముచేసి, వృక్షంబులఁ బెగలించి, జననికాయమున కపాయముఁ గూర్చ గగ్గోలు పఱచుచుండఁ బ్రజలు మొఱలిడుచుఁ జని హరిశ్చంద్రునితో నిట్లని విన్నవించిరి. "రాజా! తల్లి చాటుబిడ్డలవలె, నాకు నీడపింబెలరీతి నీరాజ్యంబునం దపరిమిత సౌఖ్యంబనుభవించితిమి. ఇప్పుడిట్టి యుపద్రవంబు వొడముటకు హేతువెద్ది? మెకంబులును బులుఁగు లనేకంబులు ను వచ్చి మమ్మనేక బాధలఁ బెట్టుచుండె. ఈమృగబాధల మాన్పకున్న మేమింక బ్రతుకఁజాలము" కృపారసంబు హృదయాంబురుహంబున వెల్లివిరియ రాజువారల కభయప్రదానం బొసంగి వీడ్కొలిపె.

యువవైన చంద్రునిమీఁద మనస్సునిల్పి యంబరసతి తన్ను ముసలివాఁడని యెంచుటచే సిగ్గుచే భాస్కరుఁడు ప

డమటి సముద్రంబునఁ గ్రుంకుచుండె. నీలమణి పాత్రిలో నుంచిన కర్పూరఖండంబులో యన గగనంబున నక్షత్రములు విరాజిల్లె. హరిశ్చంద్రుఁడు గాలోచితకృత్యంబుల నిర్వర్తించి శయనాగారంబునఁ బ్రవేశించె.

సహస్రకరుండైన సహస్రకరుఁడు పద్మగర్భభృంగసంచయముల లేపి, మలయమారుతంబునకుఁ జక్కనిదారిఁ జూపి ప్రాక్దిక్కునఁ దోఁచిబ్రహ్మాండంబు నానందసముద్రమున ముంచుచుండె. రాజు మేల్కని సంధ్యాద్యనుష్ఠానంబులఁ దీర్చి మృగయావిహారంబునం జను వాఁడై బహువిధసాధనంబుల ధరించిన శబరపతులతో విధికృతంబునఁ బుత్రకళత్రామాత్యులతో విపినంబునకుఁ బయనమయ్యె. ఆభూకాంతుఁడు గహనంబునఁ బ్రవేశించి భీకరబాణపరంపరలఁ బుంఖానుపుంఖంబుగానేసి మృగసందోహంబుఁ గూలనేసి విపినమెల్లఁ దూలించి, మృగంబుల గాలించి యరణ్యప్రదేశంబులు దాఁటి తియ్యనగు తేటనీటఁ బ్రవహించు చదలేటింగని తత్తీరంబున నిష్ఠమై ఘోరతపం బొనర్చు వసిష్ఠమహామునిని యాశ్రమంబు చొచ్చి వాని పదకమలములకు నమస్కరించె. తన్ను దర్శించినపుడెల్ల హితోపదేశంబు సేయు వసిష్ఠుఁడు నేఁడు హరిశ్చంద్రుని మనఃపూర్వకంబుగా దీవించి తత్క్షణమే సాగనంపె.

పరరంధ్రాన్వేషియగు కౌశికుఁ డంతలో హరిశ్చంద్రునిఁ

దన యాశ్రమసమీపంబునకు రప్పించు యత్నంబు సేయు వాఁడై కపటకౌశలంబున నొక్కమాయామృగంబును ల్పించి "నీవాధరిత్రీవల్లభు నెలయించి నాయాశ్రమంబున కుఁ దె"మ్మని యాజ్ఞాపించి పంపె. ఆమాయా కురంగము కుప్పించికుప్పించి దాఁటుచు, నందందు లేత దర్భాంకురము లు సామునోటికి వదలివేయుచుఁ దోఁకనిటునటు జాడించు చు బెదరిపడుచు భూవిభుని పరిసరంబున నడయాడఁ దొ డంగెను. లోహితుఁ డద్దానిఁ గాంచి "నాయనా! చూచుట కతి సుందరంబై, గంధవహుని విసర్జించివచ్చిన యిట్టిదో యనఁ జంద్రునితో విరోధించి వచ్చిన లేడియన బొాదలు నీలేడిందెచ్చియిచ్చిన బాగుండునే" యని నుడివినతోడన నాబుడుత తొక్కుపల్కుల కక్కజమందుచు సారధిని రథ ము దోలుమని రాజాజ్ఞాపించెను. ఆ లేడి వారి నెలయించు కొనుచురా నాశ్రమ సమీపంబునకు వచ్చుసరికి రాజీకఁ దడయఁ జాలక మార్జ్వరవం బొనర్చిన నక్కురంగంబు విశ్వామిత్రు సమీపంబున కేగి యదృశ్యమయ్యె. చాలద వ్వతండు దాని వెంటాడించిన కతంబున దాహతాపాక్రాం తుఁడై యందందు సరోవరంబులేని, సెలయేఱులేని, చివ రకు పడియ లేనియుండెనా యని వెదకుచుఁ గౌశికాశ్రమంబు సమీపించెను.

ఆహా! మత్తగజంబులు సింహంబులతోఁ జెరలాడుచు,

బావురు పిల్లులు చిట్టెలుకలతోఁ జెలిమిసేయుచు, నీలకంఠములు భుజంగములతో విహారముసేయుచు పులిని మేఁకను నొక్కచెఱువులో నీరు ద్రావించిరను ఖ్యాతిగాంచిన యాంగ్లపరిపాలనంబుంబోలె నక్కౌశిక పరిపాలనం బాయాశ్రమ సమీపంబునం దలరారుచుండె.

శీతలజలాన్వేషియై పోయి యారాజు స్వచ్ఛజలప్రకాశితంబును, పద్మమరంద పానలోల మదబంభర గానరతయుతంబునగు నొక సరోవరంబు గనుంగొని కృతావగాహుఁడై నిర్మలజలంబులఁ గ్రోలి చంద్రమతీ సతీమణి తోడ తలాడగా నిడుకొని శయనించి యందందలి సుందరతరులతాబృందంబు లానందంబుగఁ గనువిందొనర్ప, నమందానందకందళిత హృదయారవిందుఁ డగుచు, నాసమీపాశ్రమ మేతపసి చందురునిదోయని యోజించుచుండ నొక మునినందనుఁ డటకేతెంచి యది గాధినందను సుందరవనక్షేత్రమని యారాజపురందరుతోఁ బొందుగ వచించె. అసురవార్త విని యుత్యంతంబు భీతినొందు పురందరుభంగి నాకౌశికునివార్త విని మేదినీవల్లభుండుల్లంబునఁ బెల్లు తల్లడిల్లి "చెల్లరే! ఈముని వల్లభుండు ముక్కోపియనియుఁ బరరంధ్రాన్వేషియనియు నుడువుదురు. తదనుకూలంబుగ నాయెడమ పార్శ్వమదరుచున్నది. ఎక్కడి హేమకురంగము! ఎక్కడి మృగయావిహారము!" అవి విచారించి "ఏమి ఈవెట్టి! మునుల మాన

సములు శీతచందనసమములు. నాలుకలు విలయ ప్రభా
కర కిరణాతి తీక్ష్ణములు. వారనుగ్రహించినఁ బకీరుసు బ్ర
హ్మఁజేయుదురు. ఆగ్రహించిన బ్రహ్మను బకీరుఁ జేయు
దురు. ఆతని పదంబుల కెఱఁగి యనుగ్రహంబు సంపాదిం
తు” నని యాలోచించుచుండఁ దదేకధ్యానపరుండైన కత
నఁ దక్షణంబ నిద్రాసక్తుఁడయ్యె. ముహూర్తమాత్రము ని
ద్రించి యులికిపడి లేచి భయంబున వడవడ వణంకుచు వె
ఱ్ఱివానివలె దిక్కులు సూచుచుఁ గన్నీటం దోఁగు పతిని చం
ద్రమతి యవలోకించి “పాదుకల గాంచెఁగాఁబోలునని
వాని వెనుచఱచి నిజహస్తకంకణంబు నూడఁబెరికి
పీడకలకుఁ బరిహారంబుగా బడిస్సివైచి “గర్వాంధవైరిగంధ
సింధురనిశితాంకుశా! ఏలయిట్లు భీతిల్లెద”రని యడిగె. ఆ
త్రంబున నడుగు నాసతికాధరణి పతి “కాంతా! ఒక పాదు
కల గంటి. నేనుగొలువున్నవేళ నొక ధరణిసురుఁ డరుగు
దెంచి నాకిరీటంబు ఁబడఁదన్ని తలపట్టి యీడ్చి పంకంబునఁ
ద్రోసి పిదపఁ బైకిఁ దిగిచె” నని వచించె.

సతి మితిమీఱిన దుఃఖమునొంది మఱల తెలివివహించి
వానికి ధైర్యౌషధంబుఁ బోయనెంచి “నాథా! ఇంతమాత్ర
మునకు భీతిల్లనేల? సుఖదుఃఖములు ప్రాణికి సమానధర్మము
లు. మఱియుఁ గలలు కల్లలనికదా నుడువుదురు. అదియుం
గాక తుట్టతుదకుఁ బంకంబునుండి లేవనెత్తఁ బడితిరి. అదియు

మనకు శుభసూచనంబు. మీసత్యమే మిమ్ముఁ గాపాడు" నని ధైర్యంబు నూల్కొలిపి వాని మనస్తాపంబు చల్లార్చె.

మానిశుండాలుండు యువజన ధైర్యమూలములఁ బెల్ల గిల్లఁ జేయు మాతంగవధూయుగంబు సృజించి "కన్నియ లారా! హరిశ్చంద్రు దర్శించి మీసంగీతవిద్యాప్రసంగంబుల వాని మెప్పించి యాతఁడు పట్టరాని సంతోషముననున్నతఱి నడుగరాని పదార్థంబుల నడిగి యెట్లైన వానిని బొంకించి రం" డని యాజ్ఞాపించిన నప్పల్లవాధరలు వల్లెయని సము ల్లాసంబున మదమాతంగ విస్ఫూర్తి విడంబించు యానంబు న నృపాలుని సమీపించి "యోమార్తాండకులవతంసా! మ త్పురాకృత పుణ్యవశంబున మిమ్ముఁ గాంచితిమి. మాకు వీణాపాండిత్యము గలదు. దయయుంచి కొంచెము సేపాల కింపుఁడ"ని వేఁడి వీణెలగలీబులు వెడలించి చెఱఁగుల మెఱుఁగు వచ్చునట్లు తుడిచి భుజముల మోపి పవడంపుసారెల తానంబుల కనుకూలంబుగా నొత్తి తంత్రులు వాఁడిగోళ్ళ మీటుచుఁ గరకంకణంబులు ఘల్లుమనుచుండ నృపాలుని యుల్లంబు ఝల్లుఝల్లు మనుచుండవల్లకీదండంబులఁ బల్లవం బులు వాడమ హారమణులు కరఁగి నీరయి స్రవింప గాన మొనర్ప రాజు మైమఱచి వారి కనేక మణిమయాభరణం బులు సౌరభద్రవ్యంబులు నొసంగె. అప్పుఁబోఁడులు న వ్వుచు "ధాత్రీశా! మాకీ పదార్థంబులేల? ఈముఖలే?

దప్పిగొన్న వారికి నీరంబుగాని యాజ్యంబు హితవగునే? నిబిడాతపంబుచేత బడలితిమి. నీ గొడుగుదక్క తక్కిన వస్తువులిచ్చిన మాతాపభరం బాపనేర్చునే? నీ సితచ్ఛత్ర మొసంగి మన్నింపు" మనిన నుడిగిన యుత్సాహముతోఁ బొడమిన కోపముతో "ఓచండాల కన్యకలారా! మెండగుకండ క్రొవ్వున మీరు పుడమి తేని కిడరాని గొడుగడుగఁ దగునా! గొడుగు దక్క తక్కినవి కోరుకొనుఁ డిచ్చెద" నని వచించిన "భానుకులోద్భవా! తాపోపశమనంబు శీతలవస్తుసంతతులఁగాని కఠినమణి ప్రకరంబుల నగునే? హిమకరశైత్య సదృశంబగు నీగాఢపరీరంభణంబునఁ గాని వేఁడిఁ దేల" యని వచించిన యవ్విమలచరిత్రుండు "శివశివా!" యని చెవులు మూసికొని స్పర్శనంబునకుఁ గాదుగదా దర్శనంబునకైన మీరుదగరు. ఇందనుక మీయపరాధముల సహించి క్షమించితి. ఇంక నన్యాయోక్తులఁ బల్కిన మీనాల్కలఁ గోయుదు" ననుటయు నగ్గోసంగిపడంతులు పుడమితేని సమీపించి విలాసకళలు దొలఁక నృత్యము సేయుచు "రాజా! మిమ్ము కాంక్షించివచ్చిన పడఁతులఁ దిరస్కరించుట ధర్మవిరుద్ధంబని యెఱింగియు నిట్లు సేయుదువే"యని పేలుచు వాని కేలు కేలంగిలింప నుద్యోగించుటఁ జూచి క్రోధపూరితుఁడై వారి నచ్చటనుండి పాఱఁ దోలునదిగా మంత్రి కాజ్ఞాపించె.

అకాల్కాంతలు వాడిన మోము దామరలతో, పీతరాగం బులైన వాతెఱలతో బాష్పంబులం దోఁగిన పయ్యెదలతో విశ్వామిత్రుని కడ కేగి, "తండ్రీ! ఇత్తఱి మమ్మేల సృజించి కష్టపరంపరల ముంచితివి. మామెత్తని చిత్తంబు లుత్తలపాటునొందఁ దొత్తుల మొత్తుకైవడి మముల్మల నాతఁడు మొత్తె" నని విన్నవించినతోడ నహంకార పూరితుండై "కుమారీమణులారా! నాకోపాగ్ని కాతని నింధనముగాఁ జేసి వైచెద. మీరు విచారం బుడుగుఁడ"ని పల్కి త్రిపు రాసురులపైఁ గోపగించు నగ్గికంటివాని పగిది నాభీలరోషావేశంబున దండంబు కరదండంబునఁ బూని జటాభారంబున నతఁడు తూలియాడఁ బండ్లు పటపట కొఱుకుచు హారిశ్చంద్రుని సమీపింప సింగంబుంగనిన యేనుఁగుగున్న చందంబున భయమంది మునికి దండమిడ నాతాపసుఁడు భూరమణుకోటీరంబు బీరంబున ధారుణీస్థలిఁ బడఁదన్నె. మునికోపంబు హెచ్చుకొలఁది రాజు వినయం బతిశయింప నాతఁడు కరసరోజములు మొగిడ్చి "తాపసేంద్రా! నన్నుందన్ని నందులకు నే విచారించుట లేదుగాని మామకమణి మయ కాంచన మకుటంబునొరసి మీమృదుపదంబులు నొప్పి వహించెనేమోయని విచారించుచుంటి"నను సరసవచనంబులకు మండిపడుచు

"శా॥ ఓరీ! రాజకులాధమా! నృపులులేరో? వేఁటరారోమద
క్రూరా భీలమృగాదులందునుమరో! ఘోరాటవుల్లేవో?మా

యారామంబు గలంచి జంతుతతిమాయం జేసియుస్మత్కుమా రీరత్నంబులు వేఁడవచ్చినను వారి నోర్మేఁడినావేమిరా!"

చంకదుద్దును శరణార్థియుననుమాట నీయెడసార్థమయ్యె. తులువా! భవద్వివేకమంతయుఁ దాపస జనాశ్రమభూముల కెగ్గుసేఁతకా! నీవుకపటప్రవర్తనుఁడవు. అసిమిలోని దొకటి యు నమ్మెడునదొకటియునా! చక్రవర్తివి పేరికినిఁ జేసెడిది దురాత్మర్గమునా! మా యాశ్రమ కురంగమునా చంపఁ బూ నితివి! భృత్యుల చేతనా పల్లవపుష్పపక్వఫలభూజములనాశ నము చేయించితివి. అదియుంగాక నాముద్దిపెంపు పెంపుడు కూఁతుల రాకానిశాకరముఖులఁ బట్టిదండించితివి. నీసాము చేఁతలన్నియు వికసితశిరీషకోరకసుకుమారశరీరుల మొత్తుట కా! చూడు నిన్నిప్పుడే ప్రాభవహీనుఁ జేసెద" నని ప్రళ యకాలశమనుని వలె నుగ్రమూర్తియైన నన్నర నాధుఁడు సచివోద్బోధంబునఁ దెల్వినొంది "మునిలోకనాధా! మీకి నుక కెదిరి నిల్వనాకుఁ గాదుగదా యాలోకేశునకైనవశం బుగాదు. తనయుఁడు తప్పొనర్చినఁ దండ్రిశిక్షింపకుండునే? తూఁటికూరకు చంద్రహాస మెత్తుట పాడియే? మీకోపసర్ప మును నాపైఁ బ్రాఁకింపఁజేయవలదు. శరణంబు వేఁడు నెట్టి శాత్రవునైనఁ బ్రోచుటమీ తెఱంగిన ధర్మమేకదా! పాల ముంచినను నీటముంచినను మీదేభారము" అని శరణంబు వేఁడు హరిశ్చంద్రునిఁ గాంచి యించుక దయవహించి ము

నులయెడ వానికింగల భయభక్తులకును, వాని మహానుభావంబునకును మదిలో మెచ్చుకొనుచు, "రాజా! లేలెమ్ము! నీవు పెద్దదోషంబు చేసితివని మాకుదీర్ఘరోషంబువలదు. నీ తప్పులన్నియు క్షమించితి. నాచెప్పిన వాక్యంబొకటి తప్పక చేయవలయు. నాయనుంగు కూఁతులగు నీమాతంగ కన్యకల నొసంగెద. కాదవకపరిగ్రహింపు" మనిన యమ్మాటలమ్ములై యమ్మహీవల్లభుకర్ణపుటంబుల ఛేదించిన "క్షాత్రంబువిసర్జించి భార్యాపుత్రులుగల్గిననేనిట్టిపనికిఁగడంగుదునే?" యని తిరస్కరించు రాజుంగని "ఓయీ! వెఱ్ఱివాఁడా! ఎక్కడనున్నదో యెట్లున్నదో యేమియు నెఱుంగని పరలోకసౌఖ్యమ్మునమ్మి సద్యోలాభంబు విడుచు వేదుఱునుంగలండే? ఎప్పుడో యజీర్ణముకల్గునని యాహారముమాను వాఁడుండునే? నీ వీయిందువదనలఁ బొందిన నిన్ను బొందితోడఁ బురందరపురమునకనిపెద" నని పల్కిన రాజపురందరుఁడు విముఖత్వమున "మునిచంద్రా!

గీ॥ కులముదిగఁ దాఁచియీమాలెతల వరించి
కాంచుగీర్వాణలోక సౌఖ్యంబులొల్లఁ
బంతమున రాజ్యమైన వర్జింతుఁ గాని
చలముకొనియెన్ని చెప్పినఁ గులమువిడువ"

నని శపథముచేసె. ప్రమాదవశంబుననైనఁ దప్పు నోట వెలువడుటయే తడవుగా లటుక్కున పట్టుకొను కుకవిభంగి

విశ్వామిత్రుఁడు వానిమాటకటుక్కునఁ బట్టుకొని "భూవ రా! అట్లయగుఁగాక! నీవింకఁ దిరిగినశివునాన! నీసర్వరాజ్య ము ధారవోయుము. ఆనవాలుగా నీయంగుళీయక మిచ్చి యొక విప్రునిఁ బంపుము" అనిన రాజుమందహాసంబు చేయు చు "గాధేయా! నామనశ్శుద్ధి నరయఁ దలఁచిగాని మీకీ రాజ్యములేల? ఈభోగంబులేల? నన్నింతగా నొక్కి పరీక్షిం పవలయునే?" యని పలుకు హరిశ్చంద్రుని మాటలువిని ముని "నీనేర్పుమాటలీ విశ్వామిత్రునికడనా? రాజులలో నీ వుసత్యవాఙ్నియతుఁడవని ముజ్జగంబులు శ్లాఘించుచుండ నసత్యమాడెదవా! పోనిమ్ము! ఇచ్చెదనని పలికిన రాజ్య మీయనను మంతియ చాలు" నని పల్కె.

చంద్రమతి యా పలుకులాలకించి" మనోహరా! మీరే మియు మాఱుపలుకక రాజ్యము ధారవోయుఁడు. మనకు సూనృతసంపదయే సంపద. మున్నీ భూమినేలినవారిలో నెవ్వ రైన సూదిమొన మోపఁ జాలినంత మేరయేనిఁ గొనిచనిరా! సత్యంబునకై యానాఁడు బలిరాజ్యంబెల్లఁ గోల్పోవలేదే? కొంకకసర్వరాజ్యము దానమిం"డని బోధించె. నిజహృద యానుకూలంబును, సమస్తభువనస్తవనీయ యశోమూలం బును, నిత్యసత్యాలవాలంబునుగాఁ బల్కు సతివాక్యములా లించి పతి సంతోషితస్వాంతుఁడయ్యె.

ఆహా! అనుకూలవరారోహలు గలిగిన పతులకలభ్య

వస్తువొక్కటేనియుం గలదా! ఆపరమసాధ్వి స్వర్ణకలశం
బున జలములుగొని తెచ్చియిచ్చిన హరిశ్చంద్రుఁడు దేవ
బ్రాహ్మణక్షేత్రములు దక్క తక్కినధాత్రితలమెల్లఁ గౌశి
కునకుఁ బ్రీతిపూర్వకముగా దానమొసంగె.

మఱుసటిదినంబునఁగౌశికుఁడు కాల్యకృత్యంబులఁ దీర్చి
కొని శిష్యబృందంబు బలసికొలువ హరిశ్చంద్రుబొంకించును
పాయంబన్వేషించుచు నయోధ్యకు వచ్చెను. ముని,రాజు
రాక కెదురుచూచుచు సింహాసనము ప్రక్కనొక్క పీఠం
బున నుపవిష్టుండై యుండిన రాజులేచి వానికినమస్కరించి
సింహాసనాధిష్ఠునిఁజేసె. అంతజనసంతతు లెల్లరు విన భూ
కాంతుఁ డిట్లనియె "మీకింక నీకౌశికమునివర్యుఁడే రాజు.
నన్నుంబోలె వీనిపదనాళీకములం గొల్చుచుండు"ఁడని పల్కి
యాఁతడు విపినములకుఁ బయన మయ్యెను.

ప్రజలా వార్త విని యధికశోకార్తులై యవని భర్తకె
అఁగి "మాకే కొఱంతయు లేకుండ నేఁటిదాఁక తల్లిమ
ఱుంగు బిడ్డలవలె నుంటిమి. లేదులంబులి కప్పగించుమాడ్కి
మమ్మీక్రూరున కప్పగించుచుంటివా! అడవుల ముక్కు
మూసికొను పాడు తపసికీ సకలసామ్రాజ్య వైభవమేల?
ఈతఁడు ముక్కోపి. వీని చిత్తవృత్తి నెఱింగి మేమెత్తెఱంగు
నఁ బ్రవర్తింపఁ గల" మని మొఱ్ఱలిడిరి. రాజంత "ప్రజలా
రా! ఈతఁడు బ్రహ్మసదృశుఁడు. వీని యుదీర్ణమహాత్మ్య మొ

రులెఱుంగలేరు. నానుడువు విని మీరీ మునికెదురాడక న డువుఁడని నుడివి మునిశిఖామణికి మ్రొక్కి "మాకింక సెల వొసంగుఁడు" నిన శిలాసదృశమానసుఁడగు నాతండు "రా జా! రాజత్వంబు వహించిన మాకీ యలంకరణంబు లుచి తంబుగాని మీకేల? అలంకరణంబులన్నియు నొలిచి యి చ్చుటఁ బెట్టుఁ"డని ముని పలికిన రాజు కడునమూల్యవుం దొడవులు వెడలించి వల్కలంబులు ధరించిపోఁజూచుచుండ "హరిశ్చంద్రా! యజ్ఞార్థనుడిగిన యర్థము నీయొద్దనే యుం చినాఁడను. మావిత్తము మాకీకుండ నీవు పోవఁదగునా? పాపము! మఱచితివి గాఁబోలు. ఋణము నిశ్శేషము సేయ కున్ననది వ్రణమువలె బాధించుచుండును. అందునిది విప్రవి త్తము." అని శ్రోత్రికటువులగు వాక్యంబుల ముని పలుకు చుండ "మహాత్మా! అరవీసమైన వాఁడుకొనక నాసర్వరా జ్యము నీకొసంగితి. మాటిమాటికి లేనిపోని బాధలపెట్టి నన్ను దండించెదరేల?" యని రాజు దీనంబుగాఁ బలుక మునిశార్దూలుండు హుమ్మని యదలించి "ఔను! అప్పమా టడిగిన నందఱకుఁ గష్టముగానేయుండును. పోనిమ్ము! ఆసొ మ్మాయనక్కఱలేదను మంతియేచాలు! నీరాజ్యంబుకూడ నీకిప్పుడే యిచ్చివేసెద" నని నొవ్వనాడిన "శివశివా! అస త్యమాడువాఁడనా! సర్వరాజ్యంబు నొసంగితిని. దానఁ దృప్తినొందుమని యంటిఁగాని యాగార్థ మీనక్కఱలేదని

నుడువ లేముగదా! మునీశ్వరా! ముప్పది వాసరంబులు నాకు గడువొసంగుము. మీయప్పంతయును దీర్చెద నట్లు కాకున్న మమ్మమ్మియైన మీసొమ్ము మీరు దీసికొనుఁ"డని మహారాజు పలికె.

అంత వివిధమాయాప్రవీణుఁ బరుషభాషణు, భయచారిత్రుఁ గఠినచిత్తుని శఠుని నక్షత్రకునిఁ బిలిచి కొన్ని క్రియావిశేషంబు లుపదేశించి రేలుంబవళ్లు రాజును పీడక తాల్మి దూలించి, దైన్యంబు గిలించి, గాంభీర్యంబు వదలించి, కోపంబున నదలించి, యెట్లైన వానిచే బొంకింపుమని యుపదేశించి "రాజా! ఈతఁడు ముకుపచ్చలారనివాఁడు. మంచిచెడ్డ లెఱుంగఁడు. ఆఁకటిబాధ కోర్వలేఁడు. వీనిని జాగ్రత్తగా కనుపెట్టి చూచుచుండుము. వీని పరముగా నాసొత్తంతయు నొసంగు" మని వానికి నక్షత్రకు నప్పగించెను! అంతఁ గొంతవడికి మాని, రాజు నవలోకించి, "రాజా! ఏటికీ దిక్కుమాలిన యిక్కట్టులం బడియెదవు. నీసర్వరాజ్యంబు నీకొసంగి కష్టసముద్రమునుండి లేవనెత్తెద. ఈమాటెతల వరింపు" మని బోధించిన "ఓఋషీశ్వరా! మీఋణము సత్యస్ఫూర్తిమైఁదీర్చెద. వట్టి కుచ్చితంబులఁ బన్ని నన్ను వెతలం బెట్టఁ దగద"ని నుడివి యింక వాని వాక్యంబు లాలకింపకయే సుతసతీసహితుఁడై వనముసకుం బోయెను.

హరిశ్చంద్రుని నిర్మలచిత్తవృత్తికి, సూనృత వాక్పరత

మునకు మెచ్చుకొంచు నయోధ్యకుఁ బోయి ప్రజాపరిపాల నం బొనర్చునదిగా సత్యకీర్తి కాజ్ఞాపించి గాధేయుఁ డదృశ్యాకారుఁడై రాజు వెన్వెంటఁ దగిలిపోవుచు మధ్యమార్గమునఁ గఠిన శిలాకంటకానేక వల్మీక తరుపుంజంబులు నిర్మించియు, మిక్కుటంపు టెండగాయునట్లా జక్కవలతేనిఁ గట్టడిచేసియు, వాపీకూపతటాకాదుల నెండింపఁ జేసియు, నాభీలమృగసంచయంబులఁ గల్పించియు, బహువిధాంతరాయంబులను గలిగించుచుండె.

సతము పుష్పశయ్యం బవ్వళించు భోగులు, జోగులై యత్యంత దుర్వారచింతాపరంపరా క్రాంతహృదయులై ఘోర వనంబుల శిలాతలంబుల దాఁటుచు మార్గాయాసంబున బడలుచుఁ బోవుచుండిరి. అట్టి ప్రయాణముల కలవాటుపడిన నక్షత్రకుండును లేని బడలిక దెచ్చుకొంచుఁ జాల శ్రమపడుచు వారి ననేక బాధలఁ బెట్టుచు ననుసరించుచుండెను. మార్గాయాసంబున వారు దాహతాపక్రాంతులు కాగా నందందు జలాశయంబులుండెనా యని రాజు వెదకఁ దొడఁగె.

గాధేయుఁ డత్యంత కోపాటోపంబున దంతఘాతకుండను నొక్కనిశాటుని మాయాపాటవంబునఁ గల్పించి "ఓరీ! సూర్యాస్తమయంబునకు నీతిత్రిశంకాత్మజు మాయలం బెట్టి యాబేతాళవటముక్రింద వసియించునట్లు చేయు" మ

యాజ్ఞాపించిన నాతండు మహాప్రసాదంబని చనియె.

సుతసతీ సమేతుండై హరిశ్చంద్ర మనుజవిభుఁడు మార్గంబునఁ బోవుచుండ నొక్క మునికుంజరుండు భూతిత్రిపుండ్రంబులు లలాటంబునఁ దాల్చి, రుద్రాక్షదామంబు కంఠంబునఁ వ్రేల, తామ్రకుండలములు వీనుల నింపొందవ, మానవాధీశుఁడరుదెంచు మార్గమున మనోహర వేదికపై వ్యాఘ్రచర్మాసనా సీనుండై ముకుళీకృత నేత్రుండై యుండె. రాజా మునిని సమీపించి వానికి సాష్టాంగదండప్రణామం బాచరించె. మునివరుఁడు పెద్ద ప్రొద్దునకుఁ గనుదమ్ములు విచ్చి చూచి భ్రూసంజ్ఞచేసి రాజుంగని "రాజకంఠీరవా! అంతర్వీక్షణకళా మహత్వంబున నీవృత్తాంతము సాంతముగా నెఱింగితిని. నీవు సాంద్రకీర్తి విసరుండవగు హరిశ్చంద్రుండవు. సకల సామ్రాజ్యంబు సత్యంబునకై యొక సంయమీంద్రునకు సంతసంబున ధారవోసి యజ్ఞదక్షిణ నిచ్చెదనని పలికిన యర్థంబు పడయఁగోరి సతీసుతసమేతుండవై యీపురము వెల్వడి పోవుచుంటివని తోఁచెడిని. తాపసకుమారుఁడు పిపాసాతురుండైన వానికొఱకు నీరువెదకుచుంటి వ"ని నుడివిన సమాచారమునకు రాజాశ్చర్యచకితుండై వానికిఁ బునఃపునః ప్రణామంబు లాచరించి "మహాత్మా! నక్షత్రకరక్షణార్థము మీయాశ్రమంబున విశ్రమించెద. నన్నపయశోదురితంబులు వొందకుండ మీపావన కుండికాజలంబులఁ బోసి వాని బ్రది

కింపుఁ డనిన "రాజేంద్రా! నా కమండలువులోని జలంబ ల్పంబు. వాని కేచందంబున దాహంబుదీఱు. ఇచ్చటికి కూఁత వేటుదూరంబునందొక హ్రదము గలదు. తజ్జలంబు నిర్మల శోభితంబు. తత్తీరంబునందొక వటోర్వీరుహంబు గలదు. ఆ హ్రదజలంబులఁ గడుపారఁ ద్రావి యీరేయి యాతరుచ్ఛాయ విశ్రమింపు" మని నమ్మఁ బల్కి యామాయామౌని యదృశ్యుఁ డయ్యె.

తపనబింబ మపరాంబుధికిం జనియె. అంధకార మెల్లెడలఁ గ్రమ్మె. ఆ నిశాసమయంబున మహీరమణుండు భార్యాపుత్రనక్షత్రకసమేతుఁడై యాహ్రదముఁ జేరి జలంబులఁ ద్రావి విశాల వటవృక్షంబు నీడ శయనార్హంబని యందు లేఁతకసవు శయ్యగల్పించి నక్షత్రకుని యందు సుప్తునిఁ జేసి పైబట్ట నేలపైఁబఱచి చంద్రమతియుఁ బుత్రుఁడు తాను నిదురించుచుండిరి. తత్క్షణమ రాజు మేల్కాంచి పిశాచభూయిష్ఠంబగు వనంబుల జాగరూకతతో నుంట శ్రేయస్కరంబని యెంచి వీతనిద్రుఁడై యుండె. అంత నర్ధరాత్రమునకు వటోర్వీరుహంపు టూడలనుండి భయదవికృతభూతసంతానం బవనీతలంబున కవతరించి వారిని బాధింపఁ దొడఁగ నాతేఁడుగ్రయుత కౌక్షేయకంబున నభ్యాతకర్ణనాసికాపుటంబుల ఛేదించివైచెను. భూతపతియగు బేతాళుఁ డద్దాని విని విలయమేఘాకృతినూని చండనిష్ఫాలకంటుఁ దీండ్రమై

న కన్నులఁ గోపాగ్ని కణములు రాల, పుత్త్రైలపేరులు గళ మునవ్రేల, నురమున వఱదలై కాఱ నెత్తుఱు ద్రావుచు రాజేంద్రునిఁదాఁకి శూలంబు కేల నంకించి వైచిన నద్దాని నృపతి దునిమి వేసెను. అంత నాపలలాశి యొక్క పెనుద్రాఁకుఁ బెటికి తీవ్రింబుగ వానిఁగొట్ట మహీజాని వానికరంబు దునిమె. వాఁడు రెండవచేతఁ బాషాణపరంపరల ఱువ్వ వాని నన్నింటిని ఖండించి రాజు కుద్ధుఁడై వాఁడి యడిదంబున భీకరమైన బేతాళుని శిరమును ద్రుంచె.

ప్రబలప్రియత్నంబు లప్రయత్నంబుగ నశించుటం జేసి చలమభివృద్ధిగా నగ్గాధిపట్టి బెట్టిదంపుటలుక దుష్కరంబుల గు పుష్కలావర్తమేఘంబుల నతిభయంకరంబుగ వర్షింపఁ జేయఁ దత్తీవ్రమరీచికాసక్తదిక్తటమదావళ హస్తనీకాశ వాఃపూరధారాసిక్తమగు భీకరవర్షంబునకుఁ దడియుచు నుమారమణునిఁ దలంచుచుఁ బోవుచుండ హరిశ్చంద్రునకుఁ బొడమిన మహాహాత్పాతంబులన్నియు మంచువిడిపోవునట్లు వీడిపోవుచుండె.

గాధేయుఁ డధికాశ్చర్యభరితుఁడై విచారముతో "కట్టా! నాచేయుకపటకృత్యంబుల నొగిలి యీతఁడు చిక్కఁడయ్యె. వెడఁగనై నేనేల యీయరుంధతీధవునితో వైరము పెట్టుకొంటి. పురుహూతాదుల సమక్షమున బీరంబులువల్కి నేనిప్పుడూరకున్న నేమాయె, మఱియుంజిరకాలార్జితమైన

మత్తపంబు నశింపవలసినదేనా! కార్యాకార్యంబులు దెలియక మత్సరంబునఁ గాఱులు ప్రేలెడువాఁ డపజయమొందకుండునా! ఇంక వసిష్ఠుని ప్రతిజ్ఞాక్రియానిర్వాహి జయించు" నని తనుఁదాను నిందించుకొనుచుండె.

అంతలో వేగుఁజుక్క పొడిచెను. తూరుపు తెలివి వహించుచుండెను. ప్రాగ్లలనామతల్లి సూర్యసూనావతంసునిం బ్రసవించుచుండెను. నృపతి యచ్చోటు వాసి యొకసరోవరముంగని సంధ్యాదికృత్యముల నిర్వర్తించి కాననపర్వతగ్రామంబులు గడచిపోవుచుండ ముని, వైశ్వానరునిఁ బిలిచి "నీభయదజ్వాలావళిం బేర్చి హరిశ్చంద్రుని మార్గంబు నరికట్టి వాని నాలుబిడ్డలతో దహింపు" మని యాజ్ఞాపించినఁ గరువలిచుట్టంబు భుగభుగాయమానంబులైన జ్వాలలఁ బెల్లెగయుచు నిబిడాంధకారకోరకితవ్యోమంబగు ధూమంబు వ్యాపింపఁజేయుచు వారిని చుట్టుముట్టు సమయమున మానవాధీశ్వరుఁడు మనంబునం దింతింతనరాని చింతనొందుచుండఁ దత్కాంతామణి యొక్కింత యూహించి "నాథా! ఈ భయంకరహుతభుక్కీలానీకంబుఁ జల్లార్పనాళీకాసనునకైన వశంబుగాదు. మత్ప్రాణాహుతుల నీ హవ్యవాహనుండు సంతసిల్లి చల్లారు. మీప్రాణంబులఁ దక్కించుకొని యీబాపనయ్యను బ్రతికించి ముని ఋణముదీర్చి మీసత్యంబు మాత్రము నిలిపికొనుఁడు నాకింకానతిండ"ని వేఁడుకొనుజీవితే

శ్వరి పలుకుములుకులకు వ్యాకులితమనస్కుఁడై యశ్రు ధారాపూరితనేత్రుఁడైన పతికి జీవనౌషధీ సదృశయగు సతి "జీవితేశ్వరా! నామనవి చేకొనుఁడు దవానలంబిదే దరియ వచ్చుచున్నది. ఈమునికుమారుఁడు మరణించిన మనకు దు ర్యశంబు వాటిల్లు. మఱియుఁ బతియుండ సతిపోవుట యా మె పుణ్యఫలపాకంబునఁగాదె? సత్యమును గాపాడుఁడు. అ నుజ్ఞయిండ" ని వేఁడ నాఱేఁడు దీర్ఘ నిశ్వాసంబు విడిచి శిరంబు వంచుకొని యేమియుఁ బలుకనేరక యూరకుండ నదియ యంగీకారంబుగాఁగైకొని యయ్యాభీలదావానల జ్వాలామాలికలకభిముఖురాలై నిజచిత్తసరోజపీఠిఁ బ్రాణ వల్లభు నిల్పి పరమ పావనతేజునకు నమస్కరించి యక్కా రుటగ్గియం దుఱికిన సాధ్వినంటిన మహాపాతకంబనియో, సా ధ్విశపించుననను సాధ్వసముననో హుతాశనుండు చందనము వలెఁ జల్లదనంబు వహించె. పురందరాది బృందారకసందో హంబులమందానందకందళితహృదయారవిందులై యందంద కుందప్రసూనంబుల మకరందబిందుబృందంబులఁజల్లిరి.

విశ్వవిశ్వంభరావల్లభుఁడు ప్రాణేశ్వరినిఁ బ్రశంసించి యా దరించె.

కపట క్రియాధౌరేయుండగు నగ్గాధేయుని దుస్తంత్రము లన్నియుం బూడిదఁబోసిన నేయివోలె నిరస్తంబులుగా నింక చేయునది లేక ప్రచ్ఛన్నరూపంబున నక్షత్రకునకుఁ బ్రత్యు

క్షుమై "శిష్యా! ఈపతివ్రతాశిరోమణి యీ రాజుచెంతనుం డు కతంబున నాప్రయత్నంబులన్నియు వ్యర్థంబులగుచుండె. ఎట్లైన నీచారుశీల నెడఁబాపు" మని బోధించి మునియంత ర్హితుండయ్యె.

ఆ మఱునాఁడుదయమున నక్షత్రకుఁడా నారీశిరోమణి నవలోకించి "తల్లీ! ఆ పులోమజారుంధతీలోపాముద్రాదు లు నీకాలిగోటికైన బోలఁజాలరు. చటులదావాగ్నిశిఖానీక ము నుండి నన్ను బ్రతికించితివి. నీకుఁబ్రత్యుపకార మొనర్ప నామనంబెంతయు నువ్విళ్లూరుచున్నది. నీ యీ పడుకష్టంబు లఁగాంచిన శిలాసదృశంబగు నామనంబును నీరయిపోవుచు న్నది. మఱియుఁ ద్రిలోచనాఫాలానలమునైనఁ జల్లార్పవచ్చు ను గాని కౌశికుని రోషహుతాశన విస్ఫులింగంబులఁడగింప నెవ్వరికిని వశంబుగాదు. వెండియు నీ ధవుఁడిడిన మితియు గతించుచున్నది. ఇంతకింక నొక పైసయైన నప్పు దీర్పలేదు. నీవు నీసుతసమేతనై సాకేతమునకు రమ్ము. నేనాముని యొ ప్పుకొనునట్లు చెప్పి నీ రాజ్యంబు నీ కిప్పించెద" నని బోధిం పఁ దొడంగె.

"కుమారా! నీయాదరణమున కెంతయు మెచ్చువచ్చె. సతి కిహపరసౌఖ్యములు పతియేగదా! పతి నెడఁబాసిన స ర్వసౌఖ్యంబులు వృథగాదె!

"శా॥ వాలుంగంటికి నింటియాతఁడు మనోవాంఛాప్రదాన [క్రియా

హేలాలోలుఁడు నీలవేణికిఁ బ్రియుండేప్రొద్దునొప్పారు

త్నాలంకారము కాంతకుఁ మగఁడు నిత్యానందసంపాదియిం కేలా వేయును జెప్ప నేఁడడయుఁ బ్రాణేశుండ తన్వంగికిన్." కావున నిత్యసత్యగుణగణ్యుండగు భర్తం బాయుదునే? మారా జు సత్యకిశోరకుతారమున కీకష్ట వనపరంపర లొక లెక్క యే? ఈశ్వర కటాక్షమ్మున నీకష్టములు దొలంగి యాతఁ డు భూచక్రంబు మరలఁ బాలింపకుండునే" యని యాసా ధ్విపల్కు నంత నామె వాక్కులు సత్యంబులనునట్లు గగన వాణి మొరసె.

అమ్మహీకాంతుఁడు కౌశికు ఋణవిమోచనోపాయంబు చింతించుచు ఘోరపాతకలతావితానశితాసియు, మాధవో రోదేశఫుల్లారవిందమాలికాగంధసంవాసియు, శ్రీవిశ్వనాథకిరీ టవిధుకళాకౌముదీసముదయాచ్ఛాదితసౌధవీథియుఁ గమనీ య సంపద్విలాసియు నగు కాశిం గనుంగొని, రంగదనేక ని ర్మలతరంగయు ఫుల్లసరోరుహాభ్రమద్భృంగయు, నుభయ పార్శ్వదీపితసూనలతాకుడుంగయుఁ బూతాంగయునగు గం గఁగనుంగొని మోదాంతరంగుండై యనేక విధంబులఁ గొని యాడి మాధ్యాహ్నిక క్రియాకలాపంబులు నిర్వర్తించి భా ర్యంగనుంగొని కాశీపుర పరిభావంబంతయు సాంతముగా నామెకు వినిపించి

"సీ॥ ధర్మంబు కాశికాస్థానమధ్యంబున
నాల్గుపాదంబుల నడచియాడు

నర్థంబు కాశీపురాంగణంబున యందు
నానాప్రకారమై వీనుమిగులుఁ
గామంబు కాశికా కటకఘంటావీథి
గర్వించు రాజలోకంబు శేవ
మోక్షసంపదలు గాశీక్షేత్రమున యందుఁ
ద్రవ్వితండంబులై నివ్వటిల్లుఁ
గీ॥ గాశి కల్యాణమున కాదికారణంబు
కాశి యణిమాదిసిద్ధుల కట్టుపట్టు
కాశి జనలోకసంకల్ప కల్పవల్లి
కలుషపిశితంబు మెసవు రాకాసి కాశి"

మఱియు

సీ॥ ఉర్వీధరశ్రేణులుబ్బూఁతలూఁగంగ
నేడుగాడ్పులువీచు నెన్నఁడేనిఁ
జండభానుండు పండ్రెండుమూర్తులుదాల్చి
యెసఁగి యెండలుగాయు నెన్నఁడేనిఁ
బుష్కలావర్త కాంభోధరవ్రాతంబు
లెలగోలు వర్షించు నెన్నఁడేని
భూర్భువస్స్వర్లోకములుముంచి జలరాసు
లేకోదకముఁ జూపు నెన్నఁడేని
గీ॥ నెన్నఁడేనుండుగాలంబుమిన్ను చక్కి
భూతములుగాల్రిలు నెన్న డేఁ బుట్టినిండ్ల
నపుడువారాణసీ క్షేత్రమైమక్రోసు
లంతమేర యుపద్రపంబందకుంతు"

నని వచించి యట్టి కాశికాపురవరంబున విశ్వనాథపదా రవిందమరందపానవిశేషమత్తచిత్తుండై తన్నుఁదాను మఱచిన హరిశ్చంద్రునవలోకించి "రాజా! అప్పుమాటయే మఱచి నన్నీపాడు గ్రామంబునఁబాఱవేసి యూరకుంటివి. ఈముష్టి దేవునిఁ బట్టికొని పాకులాడిన నీ కేమియుఁగలఁడు. గడువుకాలము కూడ గతించుచున్నద"ని నక్షత్రకుఁడు తూలనాడినఁ జంద్రమతివిని మిగులఁజింతించి "నాథా! మునిఋణ మింకఁ దీర్పవలయును. తడవైనమనమిడినమితియు గతించును. మీ కన్నృతదోషంబావహిల్లు గాధిపట్టి మీచే నసత్యమాడింపఁగంకణంబు గట్టుకొనియున్నవాఁడు. సత్యభాషాపారీణులకుఁబుణ్యాంబు తుదిఁబ్రాప్తంబగు. నన్నిప్పుడ విక్రయించి మునిఋణంబుదీర్చి మీసత్యంబు నిల్పికొనుఁడు. వేఱొండుపాయంబేయెడఁ జూచినఁ గానరాదు" అని హితోపదేశంబు సేయు సతిఁగాంచి దుఃఖంపు టేఱు వెల్లువలై పాఱ "హర! హర! ఎంతపాపమెంతపాపము! ఎన్నఁడును వినరాని పరుషవచనంబులు వినవలసివచ్చెనే? యని దీనాననుండై యుండఁ జంద్రమతి ధైర్యంబు చిక్కఁబట్టి "నాథా! ఊరక విచారింపఁ బ్రయోజనమేమి? ఏదో యొక దారి ద్రొక్కి ముందుగా ఋణవిముక్తి చేసికొనినఁ గాని మనకు సుఖంబులేదు. సత్వరము నన్నమ్మి మీసత్యంబు నిల్పుకొం"డని హెచ్చరించెను.

హరిశ్చంద్రుఁ డేమి చేయుటకునుఁ దోఁపక విషాదసము ద్రిపీచికానివహంబున మున్గుచుఁ దేలుచు నెట్టకేలకు

"ఉ॥ అత్రిసమానులు న్రివిసుధాంశుకులీనులు మన్మథద్విష
న్మిత్ర నిభార్థవంతులు నమేయబలాఢ్యులునైన బ్రాహ్మణ
క్షత్రియ వైశ్యశూద్రికులసంభవులార! మదీయభార్య స
త్పుత్రవతిఁ ధనార్థినయి పోకడఁ బెట్టెద రండు విల్వఁగన్"

అని యత్యంతదైన్యంబునఁ గులాంగనావిక్రియంబునకుఁ గడంగు నాపుడమిఱేనింగని పురపురం బొక్కువారును, భార్య నమ్ముకొను వేఁడురుంగలఁడే యనువారును, తలము దప్పిన యీ వులాయనువారును, అయారే! ఇట్టి సత్యవ్రతాచారసంపన్ను లెందునేయుగంబునందు లేరనువారును, మహీపతులపట్లఁ గాపట్యము, గర్వము, దీర్ఘకోధము, యతులకుఁజెల్లునే? పరమదుర్మార్గుఁ డాకౌశికుఁడనువారు నందఱు నేక విధంబులఁ జెప్పుకొనఁదొడంగిరి.

గాధినందనునిచే బోధితుండై శనైశ్చరుఁడు వికృతమహీసురవేషంబుగైకొని కపటవృత్తిక్రియానిపుణుఁడై గణనాతీతంబగు సంపదగల్గి పెక్కుచోటుల ఋణంబులిచ్చి కాలకౌశికుఁ డను పేరఁ బరఁగుచుండె. కాలకౌశికుఁ డామేదినీశు మాట లాలించి యరుదెంచి రాజుచెప్పిన ధనంబొసంగి ధేను వత్సన్యాయంబునఁ దల్లింబిల్లంగూడ గొంపోయి సమస్తోపచారంబులు సకల నీచంపుఁగూడిగంబు లామెచేఁ జేయించు

కొనుచుండె.

రాజు పురంధ్రీరత్నంబును విక్రయంబు గావించిన ధనంబు నక్షత్రకున కర్పించిన నాతఁడు "ఇనకులతిలకా! ఆతపశీతవాతములకోర్చి, సంతత వేదాధ్యయనంబు త్యజించి, నాల్గురాళ్లు సంపాదించుకొను వృత్తి విసర్జించి నీతో వచ్చినందులకు నీవు నాకిపుడిచ్చిన బత్తె మంతేచాలునులే? ఇంతటితోఁ దృప్తి నొందెద నింకఁ గౌశికుని ఋణంబు దీర్చు యత్నంబు త్వరితంబుగఁ జేయు" మనిన రాజాశ్చర్యభరితుఁడై మిగుల విచారించి "నక్షత్రకా! మునిఋణంబు దీర్చు స్వాపతేయంబు నాకడలేదని నీవెఱుంగుదువుకదా! నన్నెవ్వరికైన విక్రయించి యప్పు నిరవశేషంబుగా నొనర్పుము." అని వచించిన వాని మహానుభావత్వమునకు లోన మెచ్చుకొంచు నట్టి ధర్మాత్ముని బాధపెట్టుటకు నియోగించిన మునిముచ్చును లోనఁదిట్టుచు ననంతరకార్యంబు నిర్వర్తింపక తప్పదని తలంచి పౌరులు వినునట్లుగా నిట్లనియె.

"సీ. బ్రహ్మచక్ర మెల్ల విశ్వామిత్రముని శిఖా
మణికి నర్పించిన మంచిదాత
ఏడుదీవులను విజృంభించి బహుజయ
స్తంభముల్ నిల్పిన శౌర్యశాలి
బేతాళుఁడనుపేరి భూతంబుదెగటార్చి
మునులభయంబు మాన్పిన మహాత్ము
నిత్యసత్యవ్రతస్తుత్యుఁడై కీర్తివి
స్ఫూర్తిచే వెలసిన పుణ్యమూర్తి

గీ. నర్కకులవార్ధి పూర్ణేందుఁడగు త్రిశంకు
కూర్మిపట్టి హరిశ్చంద్రకువలయేశు
విక్రయించెద నడిగిన విత్తమొసఁగి
గరిమఁగొనరండు! పౌరలోకంబులార!"

మదిరాపానవికారచేష్టాంధకారుండైన వీరబాహుండను చండాలుం డావాక్యంబు లాలకించి వచ్చి యాతఁడడిగిన విత్తమిచ్చి వానిం గొంపోయె.

బహుళప్రయత్నంబులు భగ్నంబులయ్యెనని ముని విచారించుచు లోఁబన్నుగడ నెన్నుకొనుచు నేమియుందోఁచక పిచ్చివానివలెఁ దిరుగాడుచుఁ బోవుచుండెను.

హరిశ్చంద్రుఁ డనుదినంబును వీరబాహుని యాజ్ఞచేఁ బగలెల్ల వానియింట నూడిగము చేయుచు రాత్రికాలంబునఁ బ్రేతభూమికధిపతియైన వానికై కల్పింపఁబడిన యుత్తుంగ మృణ్మయ వేదికాబంధురంబగు మంచెపయి నిలిచి కావలి కాయుచుండెను.

చంద్రమతి హంసనారియను నభిధానంబున నుదాసీనకృత్యంబులెల్లఁ జేయుచుఁ గౌశికుని యర్ధాంగలక్ష్మియగు కలహాకంఠికి మనసురా మెలంగుచుండె. ఒకనాఁడు కుశసమిత్పర్ణఫలములఁ గొనిరమ్మని కలహాకంఠి లోహితుని వనంబున కుంబంప నదియే తగుసమయంబని యెంచి గాధిజుండహంకారంబునఁ దనమంత్రసామర్థ్యంబునఁ దక్షకు నాకర్షణంబుచేసి యుబ్బాలకుఁ జంపునదియని వాని కానతిచ్చె.

ఒక్కనాఁ డర్ధరాత్రంబున నప్పంచజనాగ్రగణ్యుండగు హరిశ్చంద్రుఁడు మంచెపయి శయనించియుండ నొక్కయాఁడుకూయి వినంబడియె. ఆతఁడు తటాలున మంచెదిగి చూచుసరి కాశ్మశానభూమి నొకబాలశవమును దానిచుట్టు మండుచున్న కాష్ఠంబులును గానిపింప రోషంబున నాశవము నావలకులాగి "ఓసీ! నీవెవ్వతెవు? ఇప్పరేత నికేతనక్షోణిగుత్తగాఁగొనిన వీరబాహునకుఁ గప్పంబు చెల్లింపనిదే శవముల దహింపరాదు! మాడనిడి మఱి శవదహనసంస్కారంబు గావింపు" మనిన యావనిత దురంతచింతాకాంతయై "అయ్యో! ఆఁడుదాన నేనేడ? మాడయేడ? నే కటికిదరిద్రురాల! నన్ను వదలి వేయు"ఁడని యాక్రోశించెను. ఆమె దీనాలాపంబులకుఁ గరఁగిన హృదయము గలవాఁడయ్యు స్వామికార్యధురంధరుండగు నాతేఁడు "వనితా! అట్లుకానేరదు. మా యజమానునాజ్ఞ నుల్లంఘింపరాదు. ఎందైనఁబోయి మాడయడిగికొనితెమ్ము. లేదేని శవమును తీసికొనిపొమ్ము!" అనిన దుఃఖంబు పొంగిపొరలిరా నక్కుమారుని డగ్గఱనిడుకొని

"మ. అకటా! చేరెఁడునేలకుందగఁడె? సప్తాంభోధివేష్టిభవ
త్సకలద్వీపకలాపభూపముకుటాంచత్పద్మరాగోజ్జ్వల
ప్రకటానర్గళనిర్గళత్కిరణశుంభత్పాదుఁడైనట్టి రా
జకుమారుండని యెవ్వఁ గన్నుఁగవ నశ్రుల్గార్చ్వలై
[పాఱఁగన్."

గర్భనిర్భేదంబులగు నావాక్యములువినియు స్వామికార్య నిర్వాహణైక కుతూహలుండగు నృపపుంగవుఁడు "కట్టా! ఇక్ష్వాకుండు చతురబ్ధిపరీతమహీతలేశు నాత్మజుఁడని యెఱుఁగుచుంటివి! అట్టినీకు మాడయులోపంబె? లోపమేయుందువా? నీకంఠసూత్రమునఁ దళదళప్రకాశించు సూత్రమునైన నొసంగి మాడసంపాదించి నీవరసుతుని దహించుకొనలేవా?" యని పల్కిన పల్కుల కక్కలికి యులికిపడి "మత్పాతివ్రత్య విశేషంబునం జేసి పరపురుషుల కెన్నండు గోచరింపని మద్గళస్థసూత్రం బిప్పుడీ మహానుభావునకుఁ గానిపించె. ఈతఁడు హంసకులావతంసుఁడగు హరిశ్చంద్ర నరేంద్రుండు సందియంబులేదని యెఱింగి వాని యవస్థకు దైన్యంబు నొంది మూర్ఛిలి యెట్టకేలకు తెలివినొందిప్రాణేశ్వరచరణకమలములకు నమస్కరించె. మహీకాంతుండును మూర్ఛాక్రాంతుండై కొండొకసేపునకుఁ దెలిసి పుత్రశోకంబునఁగుంది తన విధికృత్యంబున కంతరాయంబు గల్గించుచున్న శోకంబుఁ బాపుకొని "ప్రాణేశ్వరీ! కటికవానికి దయ యుండదన్నమాట నీవెఱింగిన విషయమే. ధర్మంబునకుఁ గట్టువడినవాని జన్మంబెప్పుడును కష్టభరితమే? నీకడ మాడగైకొనక యిక్కార్యంబునకుం గడంగుదునేని సత్యమునకుఁ దప్పినవాఁడనగుదు. కాన నిన్నేలు నేలిక నడిగికొనియైన మాడదె"మ్మని నుడివిన నప్పడంతి పుడమిఱేని సత్యప్రభావంబున కచ్చెరువం

దుచుఁ బురవీథి నేగుచుండె. అంతట కపటకృత్యధురీణుండగు గాధిజుండొక తస్కరుని సృజించి కాశీరాజకుమారునిఁ జంపించి యాహత్య చంద్రమతి కారోపించి ప్రేతభూమికిం దోడ్కొనిపోయి వీరదాసునకుఁ దలారులచే వీరబాహుని యాజ్ఞగా నామె శిరంబు ఖండించునది యని యాజ్ఞాపింపఁజేసె. హరిశ్చంద్రుఁడు పట్టరాని దుఃఖంబునఁ బొక్కుచు "హా! హతవిధీ! ఈదుష్కృతములన్నియుం జాలక తుదకు స్త్రీహత్యయు నందును నిజభార్యా హత్యయుఁ జేయవలసివచ్చెఁగా! ఊరకుందునా! స్వామి యాజ్ఞోల్లంఘనమగు" నని వెక్కి వెక్కి లోలోన నేడ్చు పతింగని "నాథా! ఇట్టి లోకాపవాదంబు నొందిన స్త్రీ జీవించుట నిరర్థకంబు. నాప్రాణవల్లభు సముఖంబున జీవంబులు త్యజించుటకంటె నాకు వేఱొండు భాగ్యంబువలదు. బాలఘాతుకురాలునా పిలువఁబడు నీ పాపాత్మురాలిం దక్షణము చంపి పుణ్యంబు గట్టుకొనుఁ" డని నుడివె.

సత్యవాక్యధురంధరుండును, స్వామికార్యనిర్వాహణైకకుతూహలాయత్తచిత్తుండునగు హరిశ్చంద్రనరేంద్రుండు కరుణఁబోఁదొలంగి వధ్యశిల నామె నెక్కించి "సత్యశీలుండగు హరిశ్చంద్ర చక్రవర్తియే జన్మజన్మంబులయందును నాకు ప్రాణనాయకునిగా నొనర్పు" మని నిఖిలలోకైకవంద్యునారాధించు మహాపతివ్రతాశిరోమణినిఁ బ్రచండరిపుశిరఃఖండ

నోగ్రంబగు కౌక్షేయంబు నెత్తి వధించు సమయంబున గాధి జుండు వడవడవణంకుచు మాటతడఁబడ విఫలమనోరథత్వం బున ఖిన్నుఁడై "ఓయీ! నీవు రాక్షసునికంటె నధముఁడ వుపోలెఁ గన్పట్టుచున్నావు. బలవద్వైరుల దుంచు నీఖడ్గం బుచేఁ దీఁగబోఁడులకంఠంబుల విలాసంబుగాఁ దునుమాడు చుంటివా! బలే! ఏమి పరాక్రమశాలివి! అందును నీ జీవితే శ్వరిని, నీ పెన్నిధానమును పోఁగొట్టుకొందువా! చాలు! చాలు! నిట్టి దారుణకృత్యంబు మాను" మని ధర్మంబు లుప దేశింపఁ జొచ్చె.

అప్పలుకుల నెంతయు లక్ష్యంబు సేయక యమ్మండలేశ్వ రుండాఖండలకరవజ్రప్రచండంబగు కృపాణంబారోలంబవేణి కంఠనాళంబున వ్రేయ నవ్వేటు పుష్పదామంబుగతి నభిరా మంబయ్యె. త్రివ్వని యవ్వనిత గళంబు నిరీక్షించి కడుంగడు విస్మితుఁడై "ఏమిది! నిరంతరమదాజ్ఞాపరిపాలనాసక్తంబ గు నచేతనంపు ఖడ్గమును నా కెదురాడఁ జొచ్చెనా?

కం॥ అసిఁబోవఁగ వచ్చునె నా
యసిపోవక యుంచు మిగుల నాగ్రహలీలం
గ్రాసరక మఱియును హుమ్మని
యసమగతిం బూని వేయు నాసమయమునన్."

వియద్వ్యాపినీ శశికళా కోటీరముతో భసితాంగరాగ విభ్రమముతో, నరుణజటాభరముతో, ఫణికుండలముతో వినీలగళముతో, దివిజసందోహరణితవాదిత్ర శబ్దసహిత నా

రద వల్లకీనినదంబుతో గిరిరాజకన్యకాధవుఁడు శివుఁడు బ్రీత్యుక్తుమై "భూపాలాగ్రణీ! నితాంతసూనృతాలాప విశేష ధైర్య గుణలక్షణ సాహస వైభవ క్రియాలోలురగు భూపాలురీ పదునాల్గులోకంబులనెందునుగానరారు. నీవలయు వరంబులు కోరుకొమ్ము. నీసత్యంబునకు మెచ్చువచ్చె" నని సంతోషంబునఁ బల్కుచున్న శివునిఁ గాంచి యామహీపాలుఁడు లజ్జావనతవదనుఁడై "పార్వతీ మనోజలజాతమార్తాండా! రసాతలవిభూషణకరండా! ఈచండాలునకింకవరంబులేల?" యని విముఖత్వంబునఁ బల్కభక్తలోకరక్షాధురంధరుండు సెలవివాఁ అనవ్వి" సత్యవ్రతాచారా! ఇదంతయుగాథేయు మహేంద్రజాలము. నీకావంతయుఁ గొఱంతకలుగలేదు. ఇవన్నియు నేమనుకొంటివో?

"సీ. ఇదిప్రేతభూమిగాదినకులేశ్వర! పావ
నంబగు యజ్ఞవాటంబుగాని
యస్థిపోగ్రవులునుగా నమితసూనృతవచ
స్సౌభాగ్య! బహుసమిత్సమితిగాని
ఘనకపాలములుగావనవద్యసాహస!
విమలోప కరణపాత్రములుగాని
రక్తపూరముగాదు రాజన్యలోకైక
నాథ! హయ్యంగవీనంబుగాని
గీ. కడిఁదికొట్టులుగావు సంగరజయాంక!
పాదుకొల్పిన భూరియూపములుగాని

చికురజాలంబుగాదు శిక్షితసమస్త
విమతనరపాల! నవకుశవితతిగాని"

నిన్నేలు వీరబాహుఁడు కృతాంతుఁడుగాని చండాలుండు గాఁడు. నీసతిని దాసిగానేలువాఁడు మాయావేషధారుఁడగు కలిరాజు. నీభాగ్యంబు సామాన్యమే? ఇదె! నీకుదివ్యదృష్టినొసంగు చుంటి వీక్షింపు" మని వాని వీక్షణంబులనొక్కసారి తన పావనహస్తంబునఁ దుడిచిన యాతండు సర్వము గనుంగొని పరమానందభరితుండై "విష్ణుబ్రహ్మేంద్రాది గీర్వాణమకుటవిన్యస్తరత్నపటల శోభావిభాసితపాదపద్మ! మనోహరకలధౌతశైలసద్మ! మదజ్ఞానమహాంధకారంబు సర్వంబునడంగె. నన్ను నిరంతరభవత్పదకంజసేవానైపుణ మానసునిం జేయుఁ డంతియచాలు" నని వినయంబున విన్నవించె. అమ్మహాదేవుండమందసంతోషితస్వాంతుండై కాశీరాజ పుత్రిని బ్రతికించి లోహితునకు జీవదానం బొసంగె. చంద్రమతీహరిశ్చంద్రు లానందసంజనితబాష్పకణపరంపరలరాల్చుచు నక్కుమారుల నిర్వురఁ జెఱియొకరు నెత్తికొని ముద్దాడఁ దొడంగిరి.

కౌశికుఁడు లజ్జావనత శిరస్కుఁడై హరిశ్చంద్రునితో "నాయపరాధములన్నియుక్షమించి తావకసామ్రాజ్యలక్ష్మిం గైకొమ్మ" నిన మునికుంజరునకు హరిశ్చంద్రుఁడు మనఃపూర్వకపునఃపునఃప్రణామంబు లాచరించి "మహాత్మా! జగద్ధితులకు నపరాధంబులుం గలవె? అదియుంగాక నాయశంబు మీకతంబునఁగాదె యెల్లెడల వ్యాపించె. మునిచంద్రా! నామనవి యొక్కటివినుండు. రాజ్యము మరల నన్నే గైకొనుమని చెప్పవలదు. ఏలనన

ఆ. వె. హీనమతిస్వదత్తమైనను పరదత్త
మైనముల్లు మోపునంగమేర
భూమియుపహరించి పోవంగఁ ద్రోచిన
యతఁడు నరకగామియండ్రు బుధులు."

కావున మీకిష్టుండగు పార్థివేశ్వరునిచే నేకచ్ఛత్రముగా నీక్షితితలం బేలింపు మన గాధేయుండు నవ్వి "సత్యవిస్ఫూర్తిమెఱయ నాచెప్పినట్లు చేయుము. నీవే నాకిష్టుండవగు పార్థివేశ్వరుఁడవు. ఈధరిత్రీవలయంబు నీచే నేకచ్ఛత్రంబుగ నేలించెద. నాప్రతిజ్ఞాపూర్తిమెఱయ నీవు పాకశాసను గద్దెయఁ జతుర్దశమహామన్వంతరములుండు" మని యాశీర్వదించి యాజ్ఞాపించుచుండ బ్రహ్మసదృశుండును, నసమానతపోవిభవప్రభావధారేయుండును, నరుంధతీసతీ నాయకుండునగు వసిష్ఠమునినాయకుండు వచ్చి "సూర్యవంశతిలకా! నీకుఁగల సూనృతధైర్యవివేకదానరేఖాకలితప్రతాపము లెవ్వరియందును గన్గొనము. ఈకౌశిక మునిపుంగవు నాజ్ఞమీఱరాద" ని వచించెను.

సార్వభౌముండు వరచేలాంభరణగంధమాల్యాదివస్తుసామగ్రిచే నలంకృతుఁడై సమగ్రవైభవంబునఁ బట్టాభిషిక్తుఁడై మానివర్యుల యాశీర్వచనపరంపరల నౌదలఁదాల్చి శేషదిగ్గజవరాహకూర్మకుల పర్వతంబుల కుతలభార మెడల విశ్రాంతివహింప సముచితవర్తనంబునం బ్రవర్తించుచుఁ బ్రజారంజకుండై రాజ్యమేలెను.

---

# నలుఁడు

సీ. చంద్రికందర్పాది సౌందర్యవంతులు
తనుఁ జూచి సిగ్గునఁ దనరఁ దనరె
త్రైలోక్యసుందరి దమయంతి తనయందు
బద్ధానురాగగాఁ బరఁగ బరఁగె
అర్థికిఁ బ్రాణంబు నర్థంబు నిచ్చుట
నెట్టన చిరుమగా నెగడ నెగడె
అమరులు తన మనోవిమలత కిచ్చమై
మెచ్చి నెచ్చెలులుగా మెఱయ మెఱసె
గీ. మహితకర్కోట కాహీంద్రమైత్రిపరుఁడు
పుణ్యఋతుపర్ణవర్ణితాగణ్యగుణుఁడు
వితతకలిదోషసంహార విమలయశుఁడు
నలునిఁ గీర్తింప నఘములు దొలఁగుటరుదె?"

నిషధదేశాధీశ్వరుండగు వీరసేనుండు దద్దయుఁ బెద్దకాలంబు రాజ్యమేలి తేజఃకీర్తిమండలుని, నిఖిలవిద్యానటీనృత్తరంగస్థలాయతనాయమాన జిహ్వాంచలుని, బలవదహితాటవీదవానలుని నలునిఁ బట్టాభిషిక్తునిఁ జేసి వార్ధకంబునఁ దురీయాశ్రమస్వీకారంబు గావించెను. అన్నలుండు రెండవ కుసుమ కోదండుండునుం బోలె విలాసినీమండలికిఁ గన్నులపండువై యుండెఁ. వాని యాస్యమునకుఁ దఱుణహిమాంశుఁడు దాస్యమొనర్చు. వాని యంఘ్రిసంపదకుఁ బల్లవంబులు

లవంబులు. శయచ్ఛాయయుఁ గుశేశయచ్ఛాయదాయ. వేయేల? అమ్మహీశ్వరునిమూర్తి లీలాగేహాభ్యద్యభాగంబుల వ్రాసి ప్రతివసజముఖియు వానికిం దగుదునో తగనోయని మించుటద్దమెత్తితన్నుఁదాను జూచుకొని లజ్జించుచుండు. ఆతఁడు శాంతిదయాభరణుఁడు. సాధుజనాదరణుండు, దానవిద్యాపరతంత్రమానసుఁడు, సత్యభాషాభూషణుఁడునై యసనన్యగుణరూపలావణ్యరేఖావిలాసభాసమానుండగు రాజు తన కీర్తిపుంజంబు నిఖిలదేశంబుల వ్యాపింప లోకోత్తరంబుగాఁ బ్రజాపాలనంబు సేయుచుండెను.

విదర్భదేశంబునకు భీముఁడను వాఁడు రాజు. ఆతఁడనపత్యుండై దమనుఁడను ముని నుపాసించి తద్వరమున దమయంతియను నత్యంతకాంతిరూపాభిజాత్య సద్గుణమణినిఁ గుమారీమణిని గాంచెను.

నలదమయంతుల గుణగణంబుల నెల్ల వేళలను జనులెల్ల రుమిపులఁ బొగడుచుండిరి. నలుని గుణంబులు దమయంతి కర్ణపుటంబులను దమయంతి గుణంబులు నలుని వీనులంబడుచుండ నయ్యిరువురు నన్యోన్య రూపగుణశ్రవణసంజాతప్రీతులై యుండిరి.

ఒకనాఁడు నలుఁడు దమయంతీ గుణబద్ధచేతస్కుఁడై యాపవాహ్యంబు నారోహించి వాహ్యాళి వెడలెను. అంతఁ బ్రమదవనంబునఁగల హంససంసదాలాప కోలాహలముఖరిత

దిశాభాగంబైన తటాకంబుతీరంబునఁ గాంచనపక్షంబులుగల రాయంచంగనుంగొని పట్టుకొన నెంచి మందగమనంబునం జని దానింబట్టుకొని "బళిరే! ఈమరాళమునకు జాతరూపచ్ఛటాజాత రూపలక్ష్మి లవమంతేని యొవ్వానే" యని యద్భుతమందుచుండ నాహేమఖగము మనుజభాషణంబున నామనుజపతికిట్లనియె "రాజేంద్రా! సముద్రేఁడు నీహారలేశము నాశించు తెఱంగున నీవు నాఱెక్కకొనలంగలకించితాకాంచనంబున కాశింతువే? వన్నువదలిపెట్టుము. ఏను నీకుఁబ్రియంబు సేసెద. నీహృదయేశ్వరియైన దమయంతిపాలికింబోయి నీగుణగణంబులు వర్ణించి యక్కన్య యన్యులనపేక్షింపక నీయందబద్ధానురాగ యగునట్లు చేసెద. రాజా! ఆమె నీకుఁదగు. నీవామెకుఁ దగుదువు. వేయి వచింపనేల?

గీ॥ సౌరభములేని యట్టి పుష్పంబువోలె
గంధుఁగోయిల వెలియైన కానవోలె
నధిప! దమయంతి తోడి సఖ్యంబు లేని
నీదుసౌందర్యవిభవంబు నిష్ఫలంబు"

అమ్మానవతిని నీకుంగూర్చ నేర్పు నాకుఁగలదు." అని వచించిన రాజు విని పరమసంతోషంబున "నండజాధీశా! నీకు గతియందేకాక సద్వితతియందును బక్షపాతముగలదు. అధితాపపరీతాత్ముఁడ నైన నాకుఁ జల్లనిగాలివోలెఁ జల్లదంబు గూర్చితివి. ఆసుదతీతిలకంబు గుణంబులు వర్ణించి

తీరంబులేని విరహాంభారంబను సాగరంబున ముంచితివి. ఇంక నీవ తెప్పవై దీనిఁ దరియింపఁ జేయుము. నీ వేగ గమన మ్ముఁ జూచెద. త్వరితమ్ముగఁ బోయి రమ్మని వచించిన నలుని వీడ్కొని వనంబులు గడచి, శైలంబులుదాఁటి, నదు లలంఘించి, నిజకీర్తికల్పి తాఖండలపట్టన ప్రథితఖండనమును లవణాంబుధివేష్టితమేదినీ వధూకుండలమండనంబునగు కుండి ననగరమునకరిగి పతంగపుంగవుండు కన్యాంతఃపుర ప్రదేశం బు నందొక్క శృంగారవనంబులో సఖీమధ్యంబుననున్న రా జపుత్రినీక్షించి వియన్మండలంబునుండి క్రిందికి డిగ్గిన నమ్మ రాళంబును బట్టఁదలంచి వైదర్భి దాని వెంట నంటిన నప్పు లుఁగు తప్పఁగుంకియు, దాఁటియు, నోఁడుపు దప్పించుకొని కొంతదవ్వుగా నక్కాంతను దోడ్కొనిపోయి మనుజభాష ణంబున నిట్లనియె "కాంతా! నన్ను సామాన్యపక్షిగాఁ దలంచితివా!

సీ॥ నలినసంభవు వాహనము వారువంబులు
కులముసాములు మాకుఁ గువలయాక్షి!
చదలేటిబంగారుజలరుహంబుల తూండ్లు
భోజనంబులు మాకుఁ బువ్వుబోణి!
సత్యలోకము దాఁక సకలలోకంబులు
నాటపట్టులుమాకు నబ్జవదన!
మధురాక్షరములైన మామాటలు వినంగ
నమృతాంధసులు యోగ్యులనుపమాంగి!

గీ॥ భారతీదేవిముంజేతి పలుకుచిలుక
సమదగజయాన! సబ్రహ్మచారి మాకు!
వేదశాస్త్రపురాణాది విద్యలెల్లఁ
దరుణి! నీయాన ఘంటాపథంబు మాకు!"

ఒకనాఁడు బ్రహ్మ వినోదార్థంబు వాహ్యాళివెడలి మరలివచ్చునప్పుడు మాకులస్వాములైన యతనిరథరథ్యంబులు శ్రమంబున డీలుపడియున్నం జూచి యేను విమానదండంబు కంఠంబునధరించి విరించిచే బహుమానంబువడసితి. గుణపాశంబులఁ గాని పాశంబులఁబట్టువడును ననుకొంటివా! సుగుణమణిగణభూషితులగు రాజబృందారకులెందఱో నాకుఁ బ్రాణస్నేహితులు. అందువిశేషించి యశేషరాజకిరీటరత్నం బగు నలుండను రాజునందు నాకుఁ బక్షపాతముమెండు. ఆహా! వానియందమేచందంబున వర్ణింతును. మునురంభయను నచ్చరలేమ నలుని వరింపఁబూని యమర్త్యకాన భూతలమునకు రాలేక తనకోర్కి నేదోవిధముగా సమాధానపఱచుకొని యాది నలశబ్దంబుగల నలకూబరుని వరించి యాశుభనామవాసనచే జీవనముచేయుచుండెను. కాకున్న కూబరునకు ముందు నలనామము రాఁగారణము లేదుగదా! ఎందు గుణముండు దానిగ్రహించి లోకంబునకు వెల్లడింతు. ఈశరీరంబు పరోపకారంబునకుఁ గదా! నీవ నలునకుఁ దగుదువు! నలుఁడు నీకె తగు. ఆ! ఔను! కాంతా! ఇప్పుడు స్ఫురణకు వచ్చుచున్నది. మున్నొకనాఁడు బ్రహ్మకు వాహనంబు

నై పోవుచుండ మాతల్లి "నాథా! నిషధనాథునకు భార్య యెవ్వతెయగు" నని యడిగినది. చక్రఘోషమున నాకు వినియు వినిపింపనట్లు మొదటియక్కరము 'ద', యనియుఁ మదియక్కరము 'తి', యనియు వినిపించినది. అప్పటికది గ్రహింపలేకపోతిని. ఆ యాద్యంత్యాక్షరంబులు నీకుఁ దక్షొ ర్గులకుఁగానరావు. కావున నాన్నృపాలుని నీకుఁ దప్పక బ్ర హ్మసంఘటింపఁ గలఁడు. నేనును సమయము వచ్చినప్పుడు నొక్కివక్కాణింతునులే!" యని నోరూరఁబల్కు నా శకుం తవల్లభుపల్కులు వీనులునిక్కఁబొడుచుకొని విని "యండ జాధీశా! నిన్నింతయు నాయాసపెట్టినందులకు క్షమింపుము. అందని మ్రానిపండ్ల కట్టులు చాఁచుచుంటినని నీవు పరిహ సింతువేమో? అట్టి యాశలు పెట్టుకొనఁదగ" నని నిస్పృ హత్వమున నాకాంత వచించె.

పక్షిరాజు "ఓరాజవదనా! నీవావంతయు వంతనొందవ లదు. ఏనెన్నఁడును సత్యంబ వల్కుదు. లోకాలోక పర్యం తంబైన భూమండలంబున నీవెయ్యది యపేక్షింతు వద్దానిఁ గొనివచ్చి యిచ్చెద. మన్మథాకారులైన మహీవల్లభులెల్లరు నాకు వశవర్తులై యుందురు. అందును నలుఁడు నన్నుఁ బ్రా ణంబుగా మన్నించు" నని వచించె. నలుఁడనుమాట వినినం త నామె ముఖమున మందహాసము దొలంకుటఁ గనుంగొని "ఇంతీ! నీవు పితృపరాధీనవు. అందును పిన్నపాపవు. అటు

నలుఁడు ఇటునాళీకభవుఁడు. ఈకార్యంబు సంఘటించితినేని నావల నంతరాయంబు గలిగిన నాకు నలువురలోఁ దలవంపు ఘటిల్లు. ఇప్పటి కిష్టమే సూచింతువు. కప్పురగంధులచిత్తము లెప్పుడే చొప్పుననుండునో తెలియరాదు. ఈకార్యంబు దుర్ఘటంబు వేఱొక్క కార్యంబునకు నన్ను నియోగింపు" మనుటయు నామాటల కారాజపుత్రి మనస్సు కలుక్కుమన్న "విహగరాజా! నన్ననుగ్రహింపుము. నీవు సందేహ ముడుగుము. నిషధభూపాలుఁడక్క నేనన్యునభిలషింపనొల్ల నింతయేల

గీ. అనలసంబంధ వాంఛ నాకగునయేని
నల సంబంధవాంఛ నాకగునుజూవె!
చాలుసందేహవక్రి భాషణములింకఁ
దరళ! చక్రాంగ! పాథఃపతంగశక్ర!"

యని శపథ మొనర్చెను.

పతంగపుంగవుఁ డామెను నలవశంవదమానసగా నెఱిఁగి "ఇంతీ! చంద్రిచంద్రికలభంగిఁ బూవుందావి చందంబున, రసభావంబులపగిది నవినాభావసంబంధంబున నీవును నలుఁడు నన్యోన్య ప్రేమానుబంధంబున నుందురు. నీకు సందేహము వలదు. సూనశర వేదనాదూయమాన మానసుండైన నలుండు పుత్తేర నీసమ్ముఖమునకు వచ్చితి. సఖులు వచ్చుచున్నవారు. రహస్యంబు బయల్పడకుండ నుండవలయు" నని

యాంమెకడ సెలవు గైకొని నభోమార్గమున నలరాజధాని కరిగెను.

నందనోద్యానవనంబునం దశోకానోకహచ్ఛాయలఁ జంద్రకాంతోపలతలంబునందుపవిష్టుఁడైన సంక్రందనుబురుడించు నారాజనందనుఁ డుద్యానవనస్థాశోకచ్ఛాయలఁ దన రాక కెదురుచూచుచుండ నా నలునింగని జరిగిన వృత్తాంత మంతయు వచించి వాని కమందానందమునుగూర్చి పక్షికులావతంసుఁడు పంకజాసనునకుఁ బరిచర్య సేయవలయునని చెప్పి వాని వీడుకోలువడసి బ్రహ్మలోకంబునకుఁ బోయెను.

నిషధరాజు దమయంతీవియోగవిహ్వలుండగుచుఁ గాలంబు గడుపుచుండెను.

అట దమయంతి కంతకంతకు సంతాపజ్వరమతిశయించెను. దేహము కార్శ్యమునొందెను. సఖీజనులెల్లరుఁ దత్తాపోపశమనార్థము తుషారసలిలధారాసేకంబులఁ జేయుచుఁ ననేక శిశిరోపచారంబులు సేయుచుండిరి.

వయస్యాజనంబులవలన భీమభూపాలుండు నివేదిత సకల వృత్తాంతుండై ప్రియదుహితాత్మాభిలాషంబున కనుకూలంబుగా జగంబునందెల్ల దమయంతీ స్వయంవరంబుఁజాటింపం బంచెను.

నందయమీాందుగ్రిల కసాధ్యమైన దేదియు లేదు! లోకోద్భవస్థితిలయములకు వారే కారణభూతులు. గంటకు ముప్పది

హైళులేగు చలనశకటంబు నెక్కకయే, గడియకుఁ బంద్రెం డుక్రోసులరుగు ధూమశకటంబు నధిరోహింపకయే, గంట కు డెబ్బదిక్రోసులుపోవు విమానంబుపైఁ బ్రయాణంబు సే యకయే యోగవిద్యాబలంబే చేయఁతగఁగల నారదప ర్వతు లిర్వురు వాయువేగమనోవేగంబున నాకలోకంబునకుఁ బోవుచుండిరి. ఆహా! తపము గల్గినవారికి సాధనాంతరములు వలయునే?

సర్వసుపర్వులచేఁ గొల్వఁబడుచున్న సుపర్వాధీశ్వరుని సన్నిధికి నేగుదెంచి యాశీర్వదింప వారిర్వురకు సముచితాస నవిన్యాసంబు మొదలగు నుపచారము లొనరించి యాబిడౌ జుఁడు నారదు నవలోకించి "నిఖిలభువనవృత్తాంతవేదీ! ము న్నువోలె నరపతులు నాకలోకంబునకు రాకుండిరేమి హేతు వు? అతిథిప్రతతుల సందడిచేఁగలకలలాడు వానికొలువిప్పుడు పద్మరహితమైన పద్మాకరమువలె నుండుటకుఁ గారణము తె ల్పవేఁడెద" నని వినయంబున విన్నవించు దివిజనాయకునకు మునినాయకుఁడు "పాకశాసనా? చంచల్లతావిగ్రహాయు, శ తపత్రపత్రేక్షణయుఁ జంచలచంచరీకచికురయు, వీతకళంకరా కాశశాంకముఖియునగు దమయంతి నాఁబరగు కన్యకార త్నంబు, విదర్భదేశరత్నమున, భీమగర్భాంభోధికౌస్తుభరత్న మై సౌభాగ్యపరిభానిత్యలక్ష్మీనివాసమై యుద్భవించి సకల రాజలోకంబును భ్రమింపఁ జేయుచున్నది. ఆమెకు స్వయం

వరమని రాజు చాటించెను. తత్స్వయంవర మహావైభవావ లోకన కుతూహలులై రాజులందరు సంగరముమాటయే తల పెట్టక యన్నహారంబుల విసర్జించి తత్కార్యాచరణైకదీక్షులై యుండిరి. అదికారణంబుగా రాజులు నాకలోకంబునకు రాకుండిర” ని నొక్కి వక్కాణించె.

కలహభోజనుఁ డాసమాచారంబు దేవతల చెవిం బొట వేసి యటనుండి మధ్యమలోకంబునకు శీఘ్రనమేతుండై వెడలిపోయెను. మునివాగ్ఝంఝామారుతంబుచేఁ జెదరఁ గొట్టఁబడిన హృదయమేఘపటలముగలవాఁడై భోజకన్యాస్వయంవరమునకుఁ బోవ నాకాధిపతి పయనమయ్యెను. వానితో నగ్నియమవరుణాదులుగూడఁ బయనమై దివ్యకాంచన విమానంబు లెక్కి మధ్యమలోకంబున కేగిరి.

తేరెక్కిపోవుచున్న నలుఁడు విమానంబులఁబరివేష్టించి యున్న దిక్పాలురఁ జూచి యభివాదనంబాచరించిన వారు వానిం బ్రియమార దీవించిరి. అంతఁ గపటనాటకసూత్రధారుండైన శచీకళత్రుండు నలునిం గాంచి “వితరణగుణాలంకృతా! మేము నిర్జరులము. అర్థులమై వచ్చితి” మనిన నర్థియనుపేరు చెవి సోఁకినంత నలుండుబ్బి “ఇందు౧నంతవాఁడు నన్నర్థింపఁ బ్రాణంబైనను బ్రాణాధికంబైనను మఱేమైన నొసంగెద” నని ప్రతిజ్ఞచేసిన నలునకు సురపతి యిట్లనియె:-

ఓనలమహారాజా! నీకు నిక్కమగు ప్రేమయు భక్తియుఁ

గలవు. భీమపుత్రిపైఁగల గాఢానురాగంబుచే మేము వచ్చితిమి. మాకు దూతకృత్యంబు సేయుము."

నలుఁడు చేతులుజోడించి "మహాత్ములారా! అఖిలభూతాంతర్వర్తనంబుల నెఱింగెడి మీకు నెఱుకపడని యర్థంబు లేదు. నేనా నాతి వరింపఁబోవుచుంటి. నన్నిక్కార్యంబునకు నియోగించిన నేమనఁ గలవాఁడ! ఏరీతి మీరహస్యంబు రక్షింపనోపుదు. భటరక్షితంబైన శుద్ధాంతమున కెట్లీరూపంబునఁ బోఁగలను. కాన నిక్కార్యంబున కన్యులం బనువుఁడని నలుం డనుటయు నింద్రుఁడాకుంచితవదనుఁడై" ఓయీ! ఇందువంశవతంస! నలుఁడాడితప్పెనను నపకీర్తి లోకంబున వ్యాపించు. దేవతలఁట! అసదృశదానవైభవాన్వితుఁడగు నలు నర్థించిరఁట. మొదటఁ బ్రాణమైన నిత్తునని తుది నల్ప కార్యంబైనఁ జేయననెనఁట! అనుజనులాడు నపకీర్తికిఁ దాళఁజెల్లునే? అన్యోపకారోద్భూతమైన యశముగైకొనుము" ని చాటుగర్భంబులగు వాక్యంబులఁబల్కె. ఎక్కడనపకీర్తి ఘటిల్లునో యని దేవులాడు శుద్ధశ్రోత్రియ వ్రాతంబునఁ జేరిన వాఁడగు నలుండు దుర్యశంబునకు శంకించి తద్దూత్య భారంబు భరించె.

అంతఃపుర ప్రవేశంబున కనుకూలంబుగా దేవతలు వానికిఁ దిరస్కరిణీ విద్య నుపదేశించి పంపిరి.

దేవకార్యభారంబునఁ దూఁగుచు నిర్జరకార్య ఘటనా

కార్యంబు చింతించుచు నారాజకుమారుండు తిరస్కరిణీ ప్రభావంబున నొక్కమాటదృశ్యుఁడై వేఱొక్కమాటు దృశ్యుఁడై రాజమార్గంబున ననర్గళవేగంబునం జని వంచనమై డాఁగి, మరల సిగ్గుపాటునొంది యెదురుగావచ్చు నిందీవరాక్షులకోసరిల్లుచుఁ గన్యాంతఃపురంబు ప్రవేశించి కొలువుకూటంబుఁ జొచ్చి సఖీపరివారపరివృతయై తారకానీకపరివృతయగు చంద్రరేఖయుంబోలెఁ బొలుపారు దమయంతినిం గని తదీయాద్భుతరేఖా విలాసంబుల కచ్చెరువందుచు

మ॥ దళదిందీవరకాంతిఁ బంచషదళత్వక్స్ఫోటనానంత రో
జ్జ్వలరంభా తరుగర్భసంపుటలసచ్ఛాయాకలాపంబుతోఁ
గలయంగూర్చి చతుర్ముఖుండొనరించె గాఁబోలునాకర్ణశ
ష్కులికాపాంగకమైన యీచిగురుటాకుంబోఁడినేత్రద్వయిన్"

అని మెచ్చుకొనుచు నామె సౌందర్యప్రభావంబునం బడి కొట్టుకొనిపోయి కొంతవడికి దైవకార్యంబు జ్ఞప్తికిరాఁగట్టా! మోహంపుటలుగెట్టివానినైన నిహతునింజేయకమానదు. దేవతలలో నొక్కని వరించు నీమె నాకు మాతృపమానురా" లని తెలివి వహించి యామెకు సాక్షాత్కరించి "ఓతరుణీ! ఏను దిక్పతుల యాస్థానంబునందుండి నీకతిథిగా నరుదెంచితి" నని నుడివిన తోడనే దమయంతి వానికిఁ గనకాసనంబు వెట్టుమని చెలుల కాజ్ఞాపించిన వారట్లొనర్చి చనిరి.

దేవదూత తదాసనమునం దుపవిష్టుఁడైన దమయంతి "మహాత్మా! మీ రేవంశము పావనముసేయుట కుద్భవించి యేనామమున వఱలువారో చెప్పి నన్నుఁ గృతార్థురాలిం జేయుమ"నిన నలుఁడామె కిట్లనియె. "పడఁతీ! పాకశాసన, పావక, పరేతరాజ పాశపాణులు పుత్తేరఁ బనిపూని యిటకు వచ్చితి నాకర్ణింపుము. త్రిభువన మోహనంబులైన నీరూప లావణ్యవిలాసవిభ్రమాది గుణంబులు విని యయ్యాశాప తులాశాపాశంబులఁ గట్టువడిరి. కావున సకల గీర్వాణవంది తుఁడైన సురపతిని వరింపుము. కాదేని హవ్యవహుని వివాహమయ్యెదవో పరేతరాట్పాణికమలంబు పరిగ్రహించెద వో, వరుణునుద్వాహ మాడెదవో వచింపుము.

దీనత్వమాననంబునఁ దోప రాజనందని విముఖత్వంబున "ధరాధర విచక్షణతక్షా! నీపేరెయ్యది? నీవంశమేది? యని యడిగిన నేదో గాడవ త్రిప్పుకొని వచ్చెదవేల? య ని వలికె.

ఎవరిపేరు వారు చెప్పుకొనరాదు. అందును సమక్షవ్యవ హారంబునకు "నీవు, నేను" అను పదంబులుండఁ బేరుతోఁ బనియేమి? నాకై నాకాధిపతు లెదురుచూచుచుందురు. నా దూత్యంబు సార్థకం బొనర్చి పంపు" మని నలుండనిన వెం బడిని "ఓయీ! అమర్త్యులు మర్త్యులఁ గోరుట పాడియే? అగిగేమి చోద్యము! హరిణరమణీకరిని వరించునే? ఇన్ని

యేల? నలునిదక్క నన్యువరింపనొల్ల"నని తన విముఖత్వంబు దెల్పు నాయింతికిఁ "గాంతా! ఆనలుఁడే నిన్నుఁ దిరస్కరించుచో నీవు చేయునదెద్ది? కరియొహరిణాంకమణి నాశింప నయ్యెడ్ దిరస్కరించునా" యని నలుండామెను బట్టువడుపం జూచుచున్నంత నా దమయంతి

మ॥ వినుమీ నాదుప్రతిజ్ఞ తత్పరత సర్వనాథ! యేనైషధేం
ద్రునపత్నిత్వంబు వరింతు నాధరణి నాథుండాత్మనన్నొల్లఁడే
ననుమానింపక యుత్సహించి విఘ్నభవతుం బ్రాణంబు సద్భక్తిమై
ననలోద్బంధన వారిమజ్జన విధానాద్యపారపారీణతన్"

యని పల్కఁ "గాంతా! నీయంత వెఱ్ఱిది యెందైనఁ గలదా! సిరిరా మోఁకాలొడ్డువారుందురే? భాగ్యంబు దానంతనది నిన్నెదిరికొనఁ బెడ మోము వెట్టెదువే? కట్టా! నిర్జరానీక కిరీటఘటితమణిగణవిభాసమానకోమల పదాబ్జుఁడైన సురపతిని వరింపనొల్లక యొక సామాన్య మానవుని వరింతు నను నిన్నేమందును. అదియు గాక వారిఁ దిరస్కరించి ప్రాణంబులు త్యజించినను వారివారి కోర్కె లీడేఱకుండునా! ఎటులందువా?

సీ॥ అగ్నికాహుతిగాఁగ నాత్మఁ గోరెదవేని
జాతవేదుని యదృష్టము ఫలించు
రజ్జువల్లరిమీదఁ బ్రణయంబుగలదేని
యంతరిక్షంబేలు హరివరించు
సలిలప్రవేశంబు సమ్మతించెదవేని
నంబుధీశ్వరుఁడు పుణ్యంబు సేయు

నెబ్బంగిఁ బ్రాణము పేక్షించి తేనియు
　　వైవస్వతునికబ్బు వాంఛితంబు
గీ॥ ఘట్టకుటికా ప్రభాతంబు క్రమమునంది
దమ సహాయాదరి నీకు నయ్యమరవరుల
నొల్లననియును దుదిఁ బొందకుండ రాదు
సమ్మతింపుము నామాట చలముమాని"

కాన నోమానినీ! ఏదీ! నీవివేకశక్తి చూచెద! ఈనలు వుర యందు నెవ్వని వరింతువో చెప్పుమని ; యామె నెంత యు నిర్బంధపెట్టుచుండ నయ్యండజయాన, చింతాక్రాంతయై "ఓయీ! నీ వాచికసూచికాంకురపరంపర నామేను గాడు వారఁ జేయుచుంటివి! ఔను. కులముకొలఁది గుణముగదా! యమదూతకు బాధాచరణంబు నైజమే!" యని వేఁడియశ్రు లు నిగుడఁగా నృపపుంగవుని మ్రోల వెక్కి వెక్కి యేడ్వ నారాడ్వల్లభుండు తన్నును, దావచ్చినకార్యంబును, మఱచి దైవవశంబున నుచితానుచిత వివేకంబు దప్పుటయు మనసు కరఁగి నీరైపాఱ నిట్లనియె.

మ॥ అతివా! దాపఁగనేల నిన్నలచి నీకత్యంత సంతాపదు
　స్థితిఁ జేకూర్చి మీఱరాని సురసందేశంబున న్నేఁడు ని
న్నాతలం బెట్టఁగ నేగుదెంచిన మహానిర్భాగ్యుఁ డాపాపుఁడా
　హితదూరుం డవివేకి యానలుఁడు వీఁడేసుమ్మిబం బాధరా!

నలుఁడాతఁడే యని యెఱింగిన తోడనే యాదమయంతి యవనికాంతరమున కరిగె. సురరాజ కార్యఘటనా విఘ్నం

బువాటిల్లుడు నలుఁడు చింతిల్లుచుండఁ గనకహంసంబు హంసపథంబు డిగ్గి సాంత్వనవాక్యంబుల నలునూరార్చి దమయంతికిఁ బరిణయము మాట నొక్కివక్కాణించి ప్రియంబు గూర్చి వెడలిపోయెను.

నలుని దూత్యమునకును సంతశ్శుద్ధికిని సురలు ప్రమోదమందియు నక్కాంతవారివరింపమి ఖేదమంది యుపాయాంతరంబున దమయంతిని వరింపఁ దలంచి వంచనానైపుణ్యంబున నలరూపంబుల ధరించి స్వయంవరమున కరుదెంచిరి.

స్వయంవరమంటపంబు నవరత్నస్థగితమై వింతవింత కాంతులనీనుచుండెను. హాటకాద్రికూటసన్నిభంబులగు కాంచనమంచకంబులు వేర్వేఱురాజుల కమర్పఁబడి యుండెను. అఖిలాశాదేశ రాజాకర్షణ క్రియానైపుణ్యముగల దమయంతి స్వయంవరాస్థానమునకే తెంచి సరస్వతినిఁ బ్రార్థింప నామె సాక్షాత్కరించి యామె మనోభీష్టంబు నెఱింగి వరణీయుల వర్ణించుట కంగీకరించె. అయోధ్యాధిపతి నగ్గించి, పాండ్యభూపాలుఁ బ్రస్తుతించి, నేపాళ రాజు నోపిన కొలంది నుతించి, యుత్కలరాజు నుగ్గడించి యనంతరంబ నలాకృతిధరులయిన దేవతలంజూపి గూఢశబ్దార్థసంశ్లేషంబులు మెఱయ నానెఱజాణ యాదినలునిఁ జూపి "అతివా! అనల్పవిలోచనపంకజాతుండును బ్రీణితనిజవీరసేనుండును, హతమదవద్విరోధిబలుండునగు నీనలునిఁ జూడు" మని వర్ణించుచుండ నాతఁడే

నలుండని దమయంతి యోచించుచుండ నానలువరాణి తత్త
రంబునఁ గాంతా! ఇటు! ఇటు!! ఈతండె నలుఁడు. అధిక
ప్రతాపసమన్వితుఁడు. హేతిసంభూత ప్రభూత భూతియుతుం
డు. శుచిధనంజయుఁడు. నానామహాసమిన్మధ్యప్రదీప్తుండు"ని
యింక రెండడుగులు ముందునకు నైచి "నాతీ! ఈతఁడు
సుమా నలుఁడు! పరభయంకరపటుగదా ప్రహరణుఁడు.
దండనిపుణుఁడు. దక్షిణనాయకుఁడు. సమవర్తి" యనిపలికి
రెండడుగులు ముందువైచి ఆశ్చర్యచకితయై "ధవళాక్షీ! భు
వనాధీశ్వరుఁడగు నీతఁడేగదా సుమా నలుఁడు! అపారభూ
రిగభీరత్వావిశేషనిధి!"యని పెక్కుతెఱఁగుల వర్ణించుచుండ
నాకురంగనయన వినియుఁ గనియు నలుండెవ్వఁడో తెలియ
నేరక విస్మయస్మేరంబులగు విలోకనంబులం జూచుచు, నొ
క్కింత కనుమూసి పిదపఁ దనపరమపాతివ్రత్యగుణగౌరవం
బునను, బురాకృతపరిపాకవాసనావశంబునను నసమానరూ
పరేఖావిడంబితమారుండగు నైదననలుని నిషధభూపతింగా
నెఱింగి పుష్పదామంబు వానికంఠంబున వైచి నలరూపంబుల
నున్న దేవతల నతిదీనాననయై వారివారి రూపంబుల ధరింపఁ
బ్రార్థింప నయ్యమరులు క్షీరనీరవిభేదంబొనరించి హంసివో
లె నెగడిన యారాజకుమార్తె ప్రభావంబున కచ్చెరుపడి
వారివారి యాకారంబులఁ దాల్చి నలునిదూత్యంబునకు సం
తసిల్లి వానికనేకవరంబు లొసంగి చనిరి.

దేవతలసాధువాదములతో, విప్రాశీర్వాదంబులతో, బహు తూర్యారావంబులతో మహావైభవంబునఁ బరిణయోత్సవం బాయిరువురకును జరిగినపిమ్మట భీమరాడ్దంపతులు కూఁతు నత్తవారింటి కంపిరి.

ఇంద్రాదులు ఖండితమనోరథులై యూర్ధ్వలోకంబునకుఁ బోవుచున్న నభోమండలంబున గండుమీనుపడగ చండదీధితులీనఁ జిగురుజగజంపు గొడుగునీడ వాడనిననమాల వక్షస్థలంబునఁ గ్రాల, నతనుండును, లోచనాంచలంబులనగ్నిస్ఫులింగంబులురల, నత్యంతగాఢదంతాగ్రపీడనంబునఁ దొట్టవాతెఱ నెత్తురులు గాఱఁ బంచమహాపాతకసంగ్రహైకఘటనాచాతుర్యంబున, దైన్యకార్పణ్యజలధిశశాంకుండునగు లోభుండును, మోహనవిద్యాగమసంప్రదానఘటనావ్యాపారపారీణుండును, జ్ఞానప్రదీపికా ఝంఝానిలాయమానుండగు మోహుండును, నిశితోరు దీర్ఘతరచికురజాల బంధంబులతో, శరజ్జీమూతోద్భవ విసిలకాంతిచ్ఛటావారంబుతోఁ గలిము నెదురైరి. దేవతలు వారింగాంచి పట్టుపరీక్షలంతప్పిన విద్యార్థులచందంబున, విన్ననగు మొగంబులతోఁ "గామక్రోధలోభమోహులారా! సానురాగులగు నాగుల జోగులఁజేసి, యనల్పులగు వేల్పుల నల్పులుగా నొనర్చి యసమానులగు రాజమాన్యులన నూనావమానానలంబున లయంబుగావించి యాభాసురగాత్రి నలుని వరించె. మీరును మాతోడి వా

రక్తులైతిరి. రండని పచింపఁ గలిరా జవిరళరోషాంధుండై దివి జులతో "మీరెందఱును సిగ్గులేక చూచుచు నూరకుండిరా! అనలుని

మ. చతురంభోధితరంగవేష్టిత మహీచక్రంబునుం బాపి బల్
వెతలం బెట్టి మహోగ్రకాననములన్ భీమాత్మజం గూడ దు
ర్గతికిం బాలొనరించి సేవకునిగాఁ గావించి పెంపారు నా
కృతియుం బేరును మాపకున్న కలి నే? బృందారకాధీశ్వరా?

అని శపథంబు సేసి వెడలిపోయి నలునక్షురతునిగా నెఱింగి యక్షంబులం జొచ్చియుండ ద్వాపరంబుం బనిచి నలుఁడొనర్చు నశ్వమేధ మహాక్రతువులు జపహోమదానాది వివిధపుణ్యకర్మాచరణంబు గారణంబుగాఁ జోరనవసరంబు గానక రంధ్రాన్వేషణంబు సేయుచు, నొక్కనాఁడు జలోపస్పర్శనానంతరంబునఁ బాదశౌచంబు సేయమఱచిన నలునందుఁ బ్రవేశించి పుష్కరుపాలికిం బోయి నలునితో జూదం బాడి వాని రాజ్యంబు సర్వంబు నోడిచికొమ్మని చెప్పెను.

నలుఁడు కలిప్రేరణంబున దుర్వ్యసనాసక్తుఁడై దుష్టద్యూతంబునఁ గల ధనమునెల్ల నోడుచుండ దమయంతి దుఃఖితాత్మయగుచు నింద్రసేనుండను కుమారుని నింద్రసేనయను కూతును భర్తయనుజ్ఞవడసి వార్ష్ణేయునితో విదర్భాపురంబు నకంపెను.

జూదంబున నోడిపోయి ఘోరకాంతారాంతరంబునఁ దిరుగుచు దమయంతీ ద్వితీయుండై విధికృతంబునఁ బ్రాప్తంబైన

బుభుక్షాపీడ సహింపనోపక భర్మపక్షంబులతోఁ దనముందు తిరుగాడు పక్షుల వీక్షించి, భక్ష్యంబులగునని యెంచి యప్ప క్షుల నక్షీణశక్తిఁబట్ట సమకట్టి కట్టిన పుట్టంబు నెట్టన వాని పై వైచిన నవి పుట్టంబులతో నభోపట్టనంబున కెగసిన న లుండు విగతవస్త్రుండయ్యె. "నలమహారాజా! మేము నీరాజ్య సర్వస్వము హరించిన యక్షములమోక్షణంబునఁ బక్షిరూ పంబులఁ వచ్చితిమని" చెప్పి పులుఁగులు వెడలిపోయె. దమ యంతి విధికృతంబునఁ కచ్చెరువాఁదుచు మనస్థితికి వందురుచుఁ దనకట్టిన పుట్టంబు చెఱంగు గట్టుకొన నలునిఁ బనిచిన నం త వారేకవస్త్రులై యడవుల నిడుమలఁబడి పోవుచు విజనం బైన వనంబునందొకచో విశ్రమించియుండిరి. ప్రేమాక్రాంత న లునవస్థం దిలకించి వందురుచు "నాధా! ఈగహనాంతంబు లఁ గుమ్మరనేల? నాతండ్రి నిన్నెంతయు గౌరవించు. మన మిప్పుడచ్చటికిఁ బోదము. మనకు గొరంతకొంతయుఁ గలుగునే" యని పలుకు దమయంతిం గని నలుఁడు చిఱు నవ్వునవ్వి "ప్రేయసీ!

చ॥ అరిగితి చక్రవర్తివలె నప్పురి పొండిలి కిప్పుడిగతిన్
సిరియును రాజ్యముందొలఁగి సేవకబృందమువాసిదీనతం
దిరుగుచుబోయినంగడు పుత్రిమ్మరియుందురో! యల్లుఁడందురో!
అరగడెయుండలేరచట నంబలిగట్టుతెగంగ నెవ్వరున్."

అని యామెను సమాధాన పఱచెను. అంతం గొంతవడి కా రాజ దంపతులు నిద్రఁజెందిరి. అంత నలుఁడు మేల్కొంచె

నడికిఁ దెలివిదొఱంగి పాంసుల స్థలంబునఁ బడిన యామృదు లాంగి యవస్థకుఁ గడువు చెలువుగా "నక్కటా! దీని దుర్దశ నీక్షింపఁజాల నీమె విడనాడి నేనెటకేనిం బోయిన నంత నిక్కాంత నన్నుఁ గానక బంధుజనంబుల కడకేగి దుఃఖంబు లం బొరయకుండు" నని యూహించి యానెలంత మేలు కొనకుండ మెల్లన దాని వస్త్రంబునం దర్ధంబు చించి తనకుం బరిధానముగఁ జేసికొని కలిచే నాకృష్టుండై మోహపాశం బులఁ ద్రెంచి కరుణావిహీనుండై యామెను విడిచి చనియె.

అంతం గొంతసేపటికి కాకుటిలాలక నిట్టాలున మేలుకొని పతిం గనఁజాలక నిజవస్త్రార్ధ నికృంతనంబు నీక్షించి నలుగడల వీక్షించి భయశోకాకులమానసురాలై కార్యతత్పరు లేహానికిని జంకరనునట్లు తుదకుఁ దన యేకాకిత్వంబునకు వెఱవక కంటకమృగపన్నగాదులకు వగవక కాననెల్లెడలఁ గలయు వెదకుచు వెఱ్ఱిదానివలె దిక్కులు సూచుచుఁ ద్రెళ్లుచు లేచుచు సంచరించుచుండఁ గష్టంబు లొక్కటొక్కటిగా రావనుమాడ్కి నంతికన్యస్తచరణయైనదాని నాహారార్థియై యొక్కయజగరంబు పట్టుకొనిన నావనిత కదలలేక తన్ను రక్షింపుమని భర్తను బలుమాఱు ప్రార్థించుచుండఁ దదాక్రందన ధ్వనివిని యొక్క యెఱుకువచ్చి యచ్చపలాక్షి యవస్థ కచ్చెరువడి చెచ్చెర నాపాము వదనంబు వ్రయ్యందఱిగి యామె నాశ్వాసించి విగతశ్రమం గావించి "ఓజవ్వనీ!

నీ వెవ్వరిదాన విపినంబునకు రాఁగతంబేమని" యడుగ నా పడఁతి తన వృత్తాంతంబు వాని కెఱింగించిన నెఱుకలేని యాకఱకు టెఱుకు చెఱకువిలుకాని కఱకుటమ్ముల కెరయై తన హృదయం బెఱింగించిన నప్పరమ పతివ్రతాశిరోమణి కరమలిగి యాతఁడు మరణించు గాతమని శపించినఁ దక్షణ మగ్ని దగ్ధంబైన వృక్షంబువోలె నాతఁడు గతజీవుఁడై పడి యుండె.

దమయంతి యావనంబునంగల మునిసంతతుల నవలోకించి వారిచే దీవనలంబొంది చనుచు మధ్యమార్గంబునఁజను ప నొక్కదానింగని యయ్యది యెందువోయెడునని యడిగి చేదిపతియగు సుబాహుపురంబు పోవుట నెఱింగి పొద్దు గ్రుంకుదనుక నా సార్థంబుతో నడిచి యొక కాసారతీరంబున విడిసె. కడుబడలిన యాపుడమితేని పడఁతి నిద్రాసక్తయైయున్న సమయంబునం దొకగజయూథము చనుదెంచి పొంతనిద్రించుచున్న సార్థవాహులఁ గొందఱ మడియఁద్రొక్కె. అంతలో నామె మేల్కని చింతించి హతశేషులైన వారితో ననవరత ప్రయాణంబులఁ జేది పురంబుచేరిన దిన కరప్రభాపటల ధూసరిత చంద్రరేఖయుంబోలె దీప్తిహీనమై డస్సియు రమ్యాకృతినొందిన నామెను జూచి రాజమాత యక్కోమలియం దతిస్నేహంబై సఖులమూలమునఁ దోడ్తెవించి యామె వృత్తాంతమెల నరసి కడువిచారించి

"ఓకాంతా! నీవు నాకడ నుండుము. నీపతిని రోయ, భూదేవోత్తములఁ బంపెద" నని వాగ్దానం బొనరించి యామె నూరార్చె. దమయంతి యయ్యింతిపల్కులకు సంతసించి "ఓతల్లీ! ఏను సైరంధ్రినై యుండి యుచ్ఛిష్టంబు ముట్టక పరపురుషులతోఁ బలుకక పదధావనంబుం బచరింపక యుండెద. ఒండువిధంబైన నీయండ నేనుండఁ జాలననిన నయ్యండజయాన కారాజమాత యట్లులనే నాయొద్ద నుండుమని నిండుమనంబునఁ బల్కి యతిగౌరవంబున నామెం దోడ్కొని తన కూఁతు సునందకు సమర్పించెను.

దమయంతిం బాసి చనిన నలుఁడు దారుణారణ్యంబులఁ దారుచుఁ బోవుచుండ నత్యుగ్రదవానల మధ్యంబున మండలితకుండలీకాంతుని నొక్కరునిం గాంచి "ఓయీ! నీవెవ్వఁడ వేమికతంబున నిట్లు తల్లడిల్లుచున్నవాఁడ వనిన "నోదయామయా! నేను గర్కోటకుండను. కాలవశంబున నొకబ్రహ్మర్షి నుపాలంభించి తచ్ఛాపంబున నిట్లున్నవాఁడ. నన్నొక్క సరసీతటంబుఁ జేర్చి రక్షింపుమని ప్రార్థించిన నార్తరక్షణపరాయణుండగు నాయవనీధవుఁ డతి త్వరితగతి నరిగి దానింబట్టి తాపవర్జితంబైన యొక్క సరోవరంబు సమీపంబున విడువంబోయినఁ బాము పాలుపోసి పెంచినవానినైనఁ బ్రాణంబు దీయునన్న సామెతగా నయ్యది తటాలున నాతనినొక్క కాటువేసి వికృతరూపునిగా నొనర్చి యంతలో

నాత్మరూపంబుఁ జూపి "రాజా! నీవు విషపూరితుండవై తివని చింతింపవలదు. నిన్నొరు లెటెంగినఁ గీడు వాటిల్లుఁ గావున నీకు మహోపకారంబగు నంచెంచి వికృతరూపునిఁ జేసితిని. నీశరీరంబునం దెంతకాలంబు నావిషంబుండు నంతకాలంబు విషోరగరాక్షసపిశాచశత్రుని వహంబువలన భయంబు లేదు. నీకు సర్వసంగ్రామజయంబును భార్యాప్రాప్తియు, రాజ్యంబు నెప్పుడుగల్గు నప్పుడీ వికృతరూపంబు దొలంగు. వలయు నప్పుడు నన్ను మదిఁదలంతువేని యీ వస్త్రము నీయొద్దకు వచ్చు నప్పుడిద్దాన నీకు నిజరూపంబు వచ్చును. ఇక్ష్వాకు వంశజుండగు ఋతుపర్ణుండను రాజు నీకు సేవ్యుండు. అచ్చటి కేగి యశ్వహృదయంబు వానికొసంగి వానికడ నక్షహృదయంబను విద్య గ్రహింపుము. బాహుకుండను నామంబుతో సూపకారవృత్తినుండు" మని హితోపదేశంబుచేసి యదృశ్యుండయ్యె.

ఆ వచనామృతధారావారంబు గ్రోలుచు నలుం డయోధ్యానగరంబునకుం జని ఋతుపర్ణునిం గని "రాజా! నేబాహుకుండనువాఁడ! అశ్వశిక్షయందు, నన్నసంస్కారంబునందు నసాధారణప్రజ్ఞగలవాఁడను. నావిద్య పరీక్షించి యాదరింపుఁ డని" వేఁడిన దరిద్రులకు జీవగఱ్ఱయగు రాజు వాని నాదరించిన నాఁడు మొదలా బాహుకుండు దుష్టాశ్వంబుల వశంబు చేసికొనుచుఁ జవులూర నన్నసంస్కారంబులు సే

యుచు రాజు మది కెక్కునట్లు ప్రవర్తించుచు ఋతుపర్ణుచే నియుక్తులయిన వార్ష్ణేయజీవలులు దనకు సహాయులుగా సంచరించుచుండెను.

అంత నొక్కనాఁడు నలుఁ డశ్వశాలయందుఁ బ్రవేశించి భార్యావియోగంబుచే నుత్కటముగ శోకించుచుండ నతని ప్రలాపంబు జీవలుండువిని వానియొద్దఁ జేరి "నీభార్యకు నీకు వియోగమేల కలిగె"నని యడిగిన నాతఁడు తన రహస్యంబు గ్రహించెనేమోయని సందేహించి నేర్పున "జీవలా! ఇట్టి సురూపునకు భార్యయొక్కటియే తక్కువ. తొల్లి నాచెలికాఁడు మందప్రజ్ఞుఁడను వాఁడు తన లతాంగిఁ బాసి యెందునుగానక ప్రలాపించినఁ దత్ప్రలాపంబేను ననుకరించితి" నని సమాధానపఱచెను.

విదర్భదేశాధీశ్వరుండు నలుని రాజ్యభ్రంశంబు విని కూఁతురు నల్లుఁడు నెటపోయిరో యని మిక్కిలి విచారించి నలదమయంతులున్న తావెటింగి వచ్చినవారికి వేయిగద్యాణంబులు, గోసహస్రంబులు, నగ్రహారంబు నిత్తునని చాటంబంచె. జగతీతలంబునఁగల నగరమహాగ్రామంబులు భూసురులు రోసి వ్యర్థమనోరథులైరి. అందు సుదేవుండను బ్రాహ్మణుం డిమ్ములగువనమ్ములఁ గ్రుమ్మరి పల్లటిల్లి తుదకుఁ జేదిపతియైన సుబాహుపురంబునకుం జని రాజపురోహితులతో రాజగృహంబు చొచ్చి యంతఃపురంబున సునందా

సహితరైౖ యున్నదాని వియోగాగ్నిచేఁ దప్తరైౖ కృశీభూత మైన శరీరము గలదాని బహుపంక మగ్నంబైన మృణాళివో లెనున్న దానింగని గుర్తింపలేక తదీయభ్రూయుగమధ్యగతం బైన సూక్ష్మలక్షణంబు వీక్షించియంత నప్పు డామెను ద మయంతిగా నెఱింగి యామోదానందంబున "రోహిణికిఁ జం ద్రసమాగమంబువోలె నీమెకు భర్తృసమాగమంబెన్నఁడు గల్గు. తుల్యశీలవయోరూపాభిజాత్యులైన నలదమయంతు లిద్దఱు నొక్కటనుండం జూచి మావిదర్భేశ్వరుం డెప్పుడు సంతసించు" నని తలఁచి దమయంతి కభిముఖుఁడై తానువ చ్చిన సమాచారమెల్లఁ దెలియఁ జెప్పిన దమయంతి మేఘ సముదయంబునకుఁ జెలరేగి ముదమందు మయూరిచందంబు న నానందంబున నుప్పొంగుచుండె. రాజమాతయు నక్క మలాక్షిఁ బ్రీతితోఁ గౌఁగలించుకొని "తల్లీ! నీవు నా కూఁ తురవు. ఏనును నీజననియు దశార్ణరాజతనయుల మదియు విదర్భేశునకు సతియయ్యె" నని వచించి యతిస్నేహంబున నుండె. దమయంతికి విదర్భకుంబోవ మనసువొడమిన సుబా హుజనని దాని గ్రహించి స్వర్ణమణిమయ విమానోపమా నయానంబునఁ బంపించె.

భీమభూపాలుండు కూఁతునభిప్రాయంబు నెఱింగి నలు నన్వేషింప బుజమార్గులయిన భూసురుల నియోగించెను. ఆభూసురులతో దమయంతి "నాయనలారా! నైషధేశ

రుఁడు తన్నారు లెఱుంగకయున్నవాఁడు. కావున "నిత్యస త్యవ్రతుండవగు నీవు నీసతి నుగ్రాటవివంచించి దాని వస్త్రా ర్ధంబుచించి పరిధానముగఁ జేసి పాఱిపోవన్యాయంబే? నీకె ట్టి నిర్దయతగల్గె. ఇఁకనైన నామెకుఁ బ్రసన్నుఁడవుకమ్ము." అని రాజసభల వచింపుడా పలుకులకుఁ బ్రతివచనం బిచ్చు నతని నలునిగా నెఱుంగుఁడని బోధించి పంచె.

భూసురులు దమయంతి కఱపిన పలుకులెల్ల సభలంబలి కి నలునెందును గానక మగిడివచ్చిరి. పర్ణాదుఁడను పుడమి వేల్పు నలుఁడున్న తావెఱింగి తిరిగివచ్చి యావార్త నుడివి న సర్వసుగుణసంపన్నుఁడగు సుదేవుఁడు కడువేగంబున న యోధ్యకుం జని నిజవాక్చాతుర్యమేపార బాహుకుని నలు నిగా నెఱింగి

మ॥ బళిరే! కంటినిగంటి సప్తజలధి ప్రావేష్టితాఖండ భూ
లలనాధీశకిరీటవారిరుహరోలంబాయమాన ప్రభో
జ్వలితారిందమనూపురాత్తపద సేవాప్రీత గోత్రాధవున్
సలభూమీధవునాత్రి తౌఘకరుణానవ్యప్రభా మాధవున్"

అని యమిత సంతోషభరంబునఁ బలికి తత్క్షణమ నిజపు రంబున కరిగి నలుఁడున్న తావెఱింగించెను. కాని భీమరా జునకును తదితరులకునుగూడ నావికృతరూపుఁడగు నలుని ర ప్పించు నుపాయంబు పొడఁగట్టదయ్యె. సుదేవుండు దీర్ఘకా లంబు చింతించి రాజునకుపాయాంతరం బెఱింగించిదమయంతీ ద్వితీయ స్వయంవరమని ఋతుపర్ణునకువార్తనంపించె.

ఆవార్త విని ఋతుపర్ణుఁడు బాహుకునిం జూచి "బాహుకా! దమయంతీ స్వయంవరముచూడ నొక్కనాఁటన విదర్భకుం బోవలయు. నీయశ్వనైపుణ్యంబు ప్రకాశింపఁ జేయు" మనిన నలుండు తత్కర్ణకఠోరవాక్యము లాలకించి భరింపనోపక తనలోఁదా నెంతయో దుఃఖించి "ఇదికలయో! కల్లయో! కట్టా యిట్టి దెందైనంగలదా! నాప్రాణేశ్వరి, దురంతకష్టపరంపరల కోర్చి నాతో నడవులఁ బడరాని యిడుములఁబడి యర్ధాంగి యని సార్థకంబుఁ జేసికొనిన యావనితా శిరోమణి యిట్లొనర్చునా! ఏమి! నా వెఱ్ఱి! లేనివార్త లేలగల్గును. పుత్రవతియైన దమయంతి — యని యనేకవిధంబులఁ బురపురం బొక్కి దాని నెట్లైన నెఱుంగవలయునని ఋతుపర్ణునితో విదర్భకేగఁ దలంచెను.

తొల్లి వార్ష్ణేయుండు తెచ్చిన రథంబునంద శుభలక్షణంబులుగల హయంబులఁ బూన్చికొని వచ్చిన ఋతుపర్ణుఁడారథం బధిరోహించి "బాహుకా! నీహయతత్వకౌశలంబుఁ బరీక్షించి నీయభిమతం బొనరింతు" నని వాక్రుచ్చిన బాహుకుండు దవుదవ్వులం జూచిన పొడవులెల్ల నాక్షణమునఁ గదియుగా నవియంతలో వెనుకకు దవ్వాయి కనఁబడ నది దినేశ్వరు రథంబన నాతఁ డనూరుండు నాజనులకుఁ జూపట్టి మనోవాయువేగంబుల రథచోదకత్వంబు నెఱపుచుండెను. ఋతుపరుండు బాహుకుని యద్భుతశక్తి కచ్చెరువడి యా

తఁడు శాలిహోత్రుఁడో, మాతలియో, నలుఁడో కావలయు లేకున్న నితరమానవు లిట్టిరథహయ నీతి నెఱుంగరని సందియపడుచు నమితానందుఁడై వానికశ్వహృదయంబను విద్య నుపదేశించెను. తదశ్వహృదయ సామర్థ్యంబున

క॥ నలుఁడొల్లి యాక్రమించిన
కలి కర్కోటకవిషంబు గ్రక్కుచు నోడలన్
వెలువడి నలునకు విహితాం
జలియై తన్నెఱుఁగఁజెప్పెఁ జంచలుఁడగుచున్."

నలుఁడు వానింజూచి యలిగి శాపమీనున్న నాతఁడు శరణు వేఁడ నార్తత్రాణ బిరుదాంకితుఁడగు నానలమహారాజు వానిని విడిచిపుచ్చె. "రాజా! ఏను కృతార్థుఁడనైతి. నిన్ను గీర్తించిన జనంబులు నావలని భయంబునొందరని" కలి వానికి వరంబిచ్చి విభీతకవృక్షంబు నాశ్రయించె. నలుఁడు వికృతరూపమాత్రంబుదక్క తక్కిన దుష్కృతంబుల వలన విముక్తుండై విదర్భకుం జనియె.

ఋతుపర్ణుఁడు భీమానుజ్ఞాతుఁడై రథనేమీ క్రేంకారంబులతో నాప్రోలు సొచ్చె. దమయంతి యారథధ్వని విని యయ్యది నలచోదితరథసంజనిత ఘోషమేయని మిగుల వేడ్కఁజెంది యారథాధిరూఢుఁడై వచ్చు ఋతుపర్ణునిం జూచి యత్యంత వ్యాకులచిత్తయగుచుండె. ఋతుపర్ణుండు భీమునిఁ జూడఁగా నాతఁడును సగౌరవంబుగఁ బూజించి వా

పురమం దేయలంకారంబులం గానక స్వయంవరంబను మా టయే వినక, యితర దేశాధీశు జాడలెందును బరికింపక, "కట్టా! ఏమిది! స్వయంవరమన్న మాత్రమున యోచింపక వీటఁడినై వచ్చితినే! వైదర్భియంత ధర్మేతర చరితయే!" యని పరిపరివిధములఁ దలంచుచు లజ్జతోనుండె.

బాహుకుఁడు రథాశ్వంబుల బంధించి యాసమీపంబున నే విశ్రమించియుండెను. దమయంతి కేశిని యనుదానిం బిలి చి బాహుకుండను వాఁడెవ్వండో వానియందు నాచిత్తంబు లగ్నమైయున్నది. పర్ణాదునకు బదులుచెప్పిన యతఁ డాతఁ డే కావలయు. వాని కడకుం బోయి జాడ తెలిసికొని రమ్మ ని యనిపిన నాకాంతపోయి "ఓయీ! దమయంతి నీక్షేమస మాచారం బరసిరమ్మని నన్నుఁ బుత్తెంచె. నీవెవ్వరవేమి కారణంబున వచ్చితివని యడిగిన "నోనాతీ! దమయంతి పు నస్స్వయంవరమునకుఁ జనుదెంచిన ఋతుపర్ణమహారాజు ర థసారథి" నని వచింప వార్ష్ణేయుం జూచి కేశిని యాతఁ డె వ్వఁడని యడిగిన బాహుకుఁ డిట్లు చెప్పందొడంగె. "అతఁ డు వార్ష్ణేయుఁడు. నలమహారాజు పుత్రులను విదర్భేశ్వరు నొద్ద విడిచిపెట్టి యాతని రాజ్యభ్రంశంబు విని ఋతుపర్ణునిఁ గొల్చియున్న వాఁడు. అతఁడును నలు నెఱుంగఁడు. దమ యంతి యొండె నలుఁడొండె నన్నలు నెఱుఁగఁగలరు గాని యొరులకు వశంబగునా."

కేశిని యా పలుకులు విని "ఉగ్రాటవిలో వసనార్థహా రియై కటికవాని చందంబున నర్థాంగలక్ష్మియగు ప్రాణేశ్వ రినిఁ బతిబాసిపోవ నానలినాక్షి యిప్పుడు జడలు పెనగొన్న

యలకావలులతోఁ బాంసుపటలమలినమగుచున్న తనువు
తో నిరంతర బాష్పపూరంబులైన లోచనద్వయంబుతోఁ
బరితపించుచున్నది” అని బల్క కేశినిపల్కులకు బాహు
కు దులికిపడుటయు, వాని యాంతరంగ పరివేదనా భరంబు
నఁ బైకిం బొడఁగట్టని యుస్సురస్సురను నావస్సోపముల
గుర్తించి దమయంతి కెఱింగించిన నామె యాతని నలుని
గా శంకించి వానిచరితంబిమ్ముగా నెఱింగి రమ్మని యా కేశి
నిని మరలఁబంపె. కేశినియు దైవమానుషాద్భుతక్రియలు
చూచి వచ్చి దమయంతితో “సఖి! ఆతఁడెవ్వఁడోగాని
యింధనము లపేక్షింపకయ వంటకంబులఁ బచరించు. జలం
బులకొఱ కేటికింబోకయే కుంభములు దివ్యాంభఃపూరంబు
లై యుండు. అదియుంగాక చెలియా! నా పరోక్షమున మ
న యింద్రసేని యింద్రసేనల నెత్తుకొని ముద్దాడుచుండు”
నని వచించిన నా దమయంతి చయ్యన నలుఁడున్న తావున
కుం జని నలునివికృతాంగమునుంగని లజ్జాసంభ్రమంబున వివ
శాత్మయగుచుఁ “గారడవులలో నిద్రవోవుదాని సతిసాధ్వి
నింబాసి నలు నట్లోరులు నిర్దయులై యరిగినవారులేరు. నే
నాతని కేమి యెగ్గొనరించితినో యని దీనంబుగాఁ బల్క
దమయంతింగని నలుఁడు శోకాకులుఁడై “కలికీ! కలిసమా
కృష్టుఁడనై యట్లొనర్చితి. మత్తపోబలంబునను నీ దుఃఖవా
హామునను నయ్యావి యిప్పుడంతరించె. కాని పునస్స్వయం
వరోత్సుకవైన నీతోడ మాటలాడఁదగద”ని యనుచుండ
దమయంతి కృతాంజలియై “నాథా! నీయునికి నెఱుంగుటకు
ను పిమ్మటనిన్నిటకు రావించునుపాయంబునకు నిట్లొనర్ప

వలసె. నే నేపాప భావమును దలంపనని మీాయడుగులంటి వచించెద. దీనికీ పంచభూతంబులే సాక్షులు"ను సమయం బున నఖిలభూతాంతర్గతుండగు వాయుభట్టారకుండు గగనం బునుండి యెల్లవారలు విన నలున కిట్లనియె.

చ॥ అమలచరిత్రనిట్లు దమయంతిఁ బతివ్రతఁ బల్కుదే నృపో
త్తమ! విను దీనియందు విదితంబగు శీలవిధిన్ సుధాంశుడుం
గమలహితుండు నేనునయికాచితిమొక్కటమూఁడువర్షముల్
గొమరుగ దీనిఁజేకొనుము కోమలి నీకనురక్తనావుడున్.

ఎల్లవారికి నాశ్చర్యకరంబుగా సురవృష్టికురిసె. సురదుం దుభినాదంబులు మొరసె. ఋతుపర్ణుండు సర్వము నెఱింగి నలునొద్దకు వచ్చి "నిఖిల లోకపూజ్యుండవగు నో నల సార్వభౌమా! నాయొద్ద బాహుకుండనఁగాఁ బ్రచ్ఛన్నవృత్తి నున్న నిన్నెఱుంగక సంచరించితి. దీని క్షమించునది" యని వేఁడుకొని యాతనిచే సత్కృతుండై యశ్వహృదయంబుప దేశమొంది యయోధ్యకుం జనియె.

నలుండును విదర్భాపురంబున నొక్కమాసంబుండి యం దఱచే నత్కృతుండై మామ యొసంగిన మదమాతంగ తురంగమాణిక్యాది బహుమానంబులతో నిషధపురంబునకరిగి మనోవల్లభయగు దమయంతిం గూడి విధివిహితానేకాచరిత మఖుండై సకలజనానందకరంబుగాఁ జాలకాలంబు సామ్రాజ్యంబు నేలె.

---

# పురుకుత్సుఁడు.



సీ॥ మహి యెల్లయెడ నేలు మాంధాతృనకుఁ బుట్టి
యాదిగర్భేశ్వరుండనఁగ బరఁగె
బ్రాహ్మణభక్తిసంపన్న సౌజన్యత
విప్రవశుండన వినుతికెక్కె
ఇరువేల వర్షముల్ గుఱుతుగా నొకదినం
బాదిగాఁ గలయధ్వరాళిఁ జేసె
త్రిభువనప్రీతిగా దివ్యకోదండుఁడై
బహుకోటి దనుజుల బలమడంచె

గీ॥ సుజనముచికుంద భూపాలసోదరత్వ
మేరుమందరధృతి యశోమేదురత్వ
సకలగుణరత్నభూషణ సాగరత్వ
ధనునఘచ్యుతుఁ బురుకుత్సుఁ జనునుతింప!"

త్రిలోకి కమలగర్భుఁడు వినుతహృదయ ఘట్టనంబగు సాకేతపట్టనంబు నిర్మించె. విలాస లక్ష్మి కీడుజోడైన యాపట్టనము నష్టదిక్తటీహట్టచరత్ప్రతాపహారిదశ్వుఁడగు యువనాశ్వుఁడు పరిపాలించుచుండెను. విశ్వభూమీశుండగు యువనాశ్వునకుఁ జాలకాలంబుదనుక సుతుండు వెలియఁగుడు సంతత దురంతచింతాక్రాంతస్వాంతుండై పుత్త్రులు లేని సిరియేల? భోగమేల?

ఉ॥ నారకయాతనాంబుధికి నావ నిబద్ధకవాటగోపుర
ద్వారమునందుఁ గుంచికభవక్షితిజంబునకుఁ ఫలంబు వి

స్ఫారనిజార్థగుప్తికనపాయ నిధిస్థలి వంశవర్ధనాం
కూరము పుత్రునిం బడయఁగోరుట యొప్పదె యెట్టివారికిన్”

అట్టి పుత్రుని ముద్దుమోము దమిమీఱ ముద్దిడుటయే ముజ్జగమేలుటౌ లేనినాఁడిహపరంబులుం గలవె” యని వాపోయి యాత్మీయకులగురుండును, మౌనికుల గరిష్ఠుండునగు వసిష్ఠునకు విన్నవింప నాతఁ డారాజు నూఱడించి నానావిధ ద్రవ్యములను దెప్పించి, హోతలను రప్పించి, యుక్తవిధుల శతమఖప్రీతిగా నింద్రయాగంబు సేయించి వేదమంత్రాభిమంత్రితాక్షతములను జల్లిన కలశోదకములను దెచ్చి యాతేనికిం జూపి “ఈజలంబులఁ గ్రోలిన ప్రాణికి వేలావలయిత ధరణినిఁ బాలింపఁ గలుగు సార్వభౌముఁడు పుట్టు” నని చెప్పెను.

ఆ మహీరమణుఁ డారాత్రియెల్ల జాగరము జేసి తెలివిదప్పి డప్పికి నానీరు ద్రావె. అంత నయ్యినకులాగ్రణి గర్భమగ ల్చికొనుచు నర్భకుండొక్కఁడావిర్భవించెను. ఆరాజు సతులు పతిదుస్థితి విని రోదనముసేయుచు వచ్చి వసిష్ఠుని పాదకమలములపైఁబడి పతిభిక్ష నొసంగుమని వేఁడిరి.

వసిష్ఠుండు తాను జేయించిన యాగంబునం దాయవకార్యమెట్లు కల్గెనో యని చింతించి యింద్రుని మానసవీథిఁ దలంచెను. తలంపులోనన దేవ భర్త యచ్చట కేతెంచి “మునిశ్రేష్ఠా! వసిష్ఠా! ఈసవనంబునం దిసుమంతయుఁ గల్మ

షంబు వొడమదు. ఇవ్విభుఁడివ్విధి నీళ్లుపట్లు మున్నొక మహా ని దిట్టెఁ గాన నిట్టిచెట్ట యిప్పట్టున ఘటిల్లె. నీయానతి నీ రాజు ప్రాణంబులు మరల నిచ్చితి" నని వానిని సజీవునిం జేసి నిజకరాంగుష్ఠంబు తద్బాలవక్త్రనివిష్టంబుగఁ జేయ నా పసిపాపఁడును సుధాప్రస్యందమువోలెఁ గ్రోలె. కాన నాత నికి మాంధాతృసమాఖ్యఁ జేసి హరి యంతర్ధానము నొందె. అక్కుమారుండు దినదిన ప్రవర్ధమానుండై కాలోపనీతుండై సకలవిద్యల నభ్యసించెను. యువనాశ్వుండాత్మజు యువ భావంబునకు హర్షించి వసిష్ఠానుమతంబున వానికి వైభవం బునఁ బట్టాభిషేక మొనర్చెను. యువనాశ్వుండు గొంత కాలంబు దపంబు సేసి సిద్ధిఁబొందె.

మాంధాతృ మహీపాలుఁడు మహాసామ్రాజ్యభారంబు గైకొని యరుల బలిమి నడంచుచు, లోకమెల్ల సిరినిండార నేల నేలె. ఆరాజునకు శతబిందుని కూఁతురగు బిందుమ తియందుఁ బురుకుత్సుండును, నంబరీషుండు, ముచికుందుండు ననువారు ముగ్గురు కొమరులును నేబండ్రుగూఁతులును జనిం చిరి. మాంధాత పెద్దకొడుకగు నంబరీషునిఁ దత్పితామ హుండగుటం జేసి యువనాశ్వుండు దనకుఁ బుత్రుండు గా వలయునని కోరి పుచ్చుకొనియె. అయ్యంబరీషునకు యావ నాశ్వుండు వానికి హారితుండు జనించిరి. ముచికుందుండు ముందునుండియు ముకుందపాదారవిందమరందపానాసక్తు

డై యోగియై తపం బొనరించె. పురుకుత్సుండు సాముగరి డీల యందును, విలువిద్యలోను, నశ్వారోహణము మొదలు గాఁగల క్షాత్రవిద్యావినోదంబుల నందివేసిన చేయియై సద్గుణగణగరిష్ఠుఁడై ధర్మపథానుసరుఁడై యుండె.

ఒకనాఁడు మృగయావ్యాసక్తుఁడై పురుకుత్సమహీపాలుండు విశ్వామిత్రాశ్రమ పరిసరారణ్యంబులకు వేఁట కేగి ప్రమాదవశమున నాశ్రమ మృగంబును భైరవాశుగహతికి లోఁబఱచినఁ గనుల నిప్పులురాల ధుమధుమలాడుచు విశ్వామిత్రుఁడు వచ్చి

చ॥ కలితతపఃప్రతాపశిఖకాండములన్ వెలుఁగొందుచున్న నా
కొలఁది యెఱుఁగ కెవ్వఁడిటు గూల్చెశిలీముఖసంచయ [మ్మునన్
లలిత శిరీషపుష్పమృదులంబగు నీ మృగశాబకంబు వాఁ
డలయుచు వేనధోగ్గతుల నందెడుఁ గావుత మొక్క పెట్టునన్.

అని శపించెను.

రాజు మునిరాజు పాదముల పైఁబడి "పులియని పొరపడి చంపితి. భూమిని బాధించెడు మిత్రోత్థితమగు గ్రహములు తిరిగి మిత్రునిం జేరినట్లు మీకోపాగ్ని చేఁ గలిగిన నాకడుపు చిచ్చు మీలోనికిం దెచ్చుకొనుఁ" డని మిక్కిలియు వేఁడిన "రాజా! నీవు వదలిన బాణమును నీవు వెనుకకు నాకర్షింప లేనట్లు నేనును నా శాపంబు మరలింపలేను. కాన నీకధోలోకగతి తప్పదుగాని యయ్యది శుభంబే యగునులే. తరు

వాత నూర్థ్వలోకమునకు వచ్చి ప్రాణాధికయగు నీ దేవివల
న సూర్యసమానుండగు పుత్రునిం గాంచి సుఖంతువు పొమ్ము”
ని వచించెను.

ఆ సమయంబుననే యురగలోకంబునుండి యంశుమంతా
దినాగ కుమారులు వచ్చి సుందరాకారులగు రాజకుమారు
లెందుండిరో వెదకుచుఁ దత్సమీపారణ్యమునకు వచ్చి యా
పురుకుత్సుని లీలామానుషవిగ్రహము విలోకించి యాశ్చ
ర్యానందభరితులై యారాజును గొంపోయి నర్మదోద్యాన
వనమందుఁ జలువరాతి తిన్నెపైఁబరుండఁబెట్టిన నర్మదాపురు
కుత్సు లన్యోన్య వీక్షణమున మోహావిష్టులై దంపతులగుదు
రుగాక” యని తలంచి మోహనవిద్యాప్రభావంబునఁ దక్షి
ణమ వాని నిద్దురపుచ్చి యధోలోకమునకుం గొంపోవఁ
దలంపిడిరి.

ఉరగలోకమునకు మందారుండనువాఁడు రాజు. నర్మ
దయను పూవుఁబోఁడి వానికనుంగు కుమార్తె. నర్మద
నర్మదోద్యానవనంబున కానాఁడు నవమాలికాదిచేటికాప
టల సమన్వితాంఘ్యయై పయనంబై వచ్చి పూలచెట్లకు నీరు
పోసి చేటికల నెల్లరను వీడ్కొల్పి ప్రియసఖియగు నవమా
లికతోఁ గొంతసేపు ముచ్చటించుచుఁ బ్రకృతి సోయగంబు
లం గనుంగొనుచు గతరాత్రి తాను స్వప్నంబునఁ గాంచిన
మహాసుందరపురుషుం డమూల్యమణిగణఖచితభూషణుండు,

మహారాజలక్షణలక్షితుం డెన్నఁడైనఁ గన్నులం బడునాయని మనంబునఁ జింతించుచు వనమెల్లఁ గలయఁ దిరుగుచుండెను.

రాజా యాశ్రమ సమీపంబునందే ఇచ్ఛాపాత్రరంబుల వల్లించుకొని భయమందుచు నందందుఁ దిరుగాడుచుఁ దత్సమీపస్థతరంగిణినిఁ దాపోపశమనార్థమవగాహనముసేయుచుఁ బిదప సరోవరములపొంత కరుదెంచుచు, మరలనిసుము తిన్నియలసమీపించుచు సాయంకాలము వఱకుఁ దిరుగాడుచుండెను. అంతలో వానికి మృగయా వ్యాపారంబునఁ బెల్లగు శ్రీమంపాటావహిల్ల నొకమావిజీబు ప్రక్కనొదిగె. నాగకుమారుండగు నంశుమంతుఁ డాతని మోహన విద్యచే వశ్యునింజేసికొని యురగలోకమునకుం గొనిపోయి యొకచో నిలువఁబెట్టి తన్మోహనవిద్య నుపసంహరించి వెడలిపోయెను. నిలువఁబడియున్న రాజు నిలువఁబడినట్లుగాఁ గనులు తెఱచి నలుకెలంకులఁగలయఁజూచి కలవరింపు "అకటా! ఇది యేమిచోద్యము!

సీ. దట్టంపుఁ దెలినీటిపెరఁగచాల్కడకొత్తి
నెలఱాలజగతిఁ దానిలుచుటేమి
కొలఁకుఁ దామరగందములఁ గ్రిందఁబడవైచి
కపురంపుఁ దావిఁ దాఁగవియుటేమి
చివురు జొంపపుమావిజీబు మాయముసేసి
పసిఁడియుప్పరిగఁ దాఁ బ్రిబలుటేమి
నిద్దంపుటిసుముతిన్నియ పొన్నుదిగఁదాఁవి
యులరులపాన్పుఁ దాహత్తుటేమి

గీ. మసమసకసంజ కెంజాయమఱుఁగు వెట్టి!
మిసిమికెంపులకాంతిఁ దామెఱయుటేమి!
మొదలనేనది తటినున్న యదియులేదొ!
మాయయోకాక యిదియంచు మరలిచూడ."

ఓహో! విశ్వామిత్రా! నీకధోగతియగు నంచంటి విదేగాఁబోలు! ఎందుంటినో! నే నెవండ నేస్థితియందుంటినో యెఱుంగకుంటి నింతకంటె నధోగతి యేమికావలయునని విచారించుచుండఁ గనుమూసి కనుతెఱచుకాలంబున కోకకాంతారత్నమారాజు కన్నులకుం బొడఁగట్టె. ఆకాంత సరిలేని విలాసముగని రాజచ్చెరువొంది "నాగకన్యకలు రూపవిభ్రమరేఖాఖనులని వినుటయేగాని కనియెఱుంగ. నేటికి నాజన్మ కృతార్థతను [illegible]నద"ని యెంతయు నుప్పొంగుచుండఁ జిఱునవ్వువెన్నెలతోఁ దళుకుబెళుక్కను మేనితో వేణికటి సీమపై నటింప నాకాంత రాజును సమీపించి "మహారాజా! మార్తాండతేజా! మీవృత్తాంతమింతకు ముందే కొంచె మిచ్చట వినియుంటిని. మీకు పాపమూకోపిష్టిముని శాపముదగిలినదా!" యని యడిగెను.

రాజు పరవశుఁడై మందహాసముచేయుచు "శాపము వరమైనది. ఆ వరమహాత్మ్యమున నేగదా దుర్లభమైన యురగలోకంబు సేరఁగల్గితిని. ఆవరమున నేకదా యిట్టియపూర్వదర్శన లాభము లభించినది. అంతనఱకే యామునియొక్క వరమాహాత్మ్యము. అటుపైన నీకటాక్షమహాత్మ్యమును—నాభాగ్యరేఖయేకదా!

నర్మద:—ఒకలోకమువారు మీరు. వేఱొక లోకమువార ము మేము! మీకును మాకును సఖ్యము సరిపడ నిదేకదా!

పురు:—వెఱ్ఱిదానా! ఎక్కడ సూర్యుఁడు! ఎక్కడభూమి! ఎక్కడ చంద్రుఁడు! ఆకర్షణశక్తిచే నొకరిచుట్టు నొకరు విడువక తిరుగుదురుగదా! అట్టిచో సహ వాస మెట్టులొాదవె?

నర్మ:—మీరు మహారాజులు! ఇదివఱకు మీకెందరు భా ర్యలని యడిగిన క్షమింతురుగాక!

పురు:—ఇదివఱకు సుమతియను భార్య యొక్కతియే కలదు.

నర్మ:—ఆమె మీ కర్ధాంగలక్ష్మియేకదా!

పురు:—పార్వతి యర్ధాంగలక్ష్మియైనను శివుఁడు గంగను నెత్తిపైఁ బెట్టుకొనలేదా!

నర్మ:—నిజమేనా!

పురు:—నాగులకువలె నాలుకలు రెండుండునా?

నర్మ:—మీరు దానికిఁ బ్రభువే యైతిరిగదా!”

ఆరీతి వారుభయులు సంభాషించుచుండ నంశుమంతుండు విని “అయ్యో! వీరిద్దరును గడుంగడు మోహావిష్టులైరి. మహా రాజుగారి సెలవులేనిదే నామోహనవిద్యాప్రభావమున వీరి రువురకును సంఘటింపఁ జేసితి. వీరికొకరియెడ నొకరి కను రాగమెట్లుండునో పరీక్షించుటకే యిట్లొనర్చినాఁడ! ఈరాజేం

ద్రమునుండి యీనర్మద నిప్పుడే వేఱుచేసినఁగాని వారిదాంపత్య సౌఖ్యము జీవితాంతము నిల్చియుండదని" నిశ్చయించి యీ పెపై మోహనాస్త్రంబు ప్రయోగించి దాని కదృశ్యమంత్ర మును దాపుచేసి యామెను రాజమందిరమున విడిచి పుచ్చెను.

అభినవతారుణ్యభువనైకగణ్యయగు నా నాగకన్య చూచుచుండగనే మాయమగుటకు నాశ్చర్యచకితుఁడై యామె సాన్నిధ్యవియోగమునకు దుఃఖించుచుండెను. వాని కన్నులఁగట్టినట్లున్న నా నాగకన్నె చిత్తరువు తద్విభుని చిత్తంబంతయుఁ దచ్చిత్రపటంబగుడు నిరంతర చింతాతిశయంబునఁ దదాయత్తచిత్తుండగుచు సూనశరశరధిమగ్నమానసుండగుచు నమ్మహీపాలుం డేటి కెదురేగుచందంబున దుర్భరంబైన కాలంబు గడుపుచుఁ దన్నర్మదోద్యానవనమున నుండెను.

అంత నచ్చట నర్మద కొంతసేపటికి నిజహర్మ్యంబునఁ దెలివినొంది రాజు లేకుండుటం గని మిగుల దుఃఖించుచు "నాథా! నాగులకు నాలుకలు రెండుండునని యధిక్షేపించితివే! నీకొక్క నాలుకయే గదా! అప్రయత్నముగ స్వప్నమునఁ గానుపించిన సౌందర్యరాశి లభించెనని యుప్పొంగితిని! పొంగుపాటెవ్వరికినిం గూడదను పెద్దల నీతివాక్యము నాయెడ సార్థకంబయ్యెనా! సమస్త ధర్మశీలుండవు నీవే యిట్లొనర్తువా" యని వాపోయి తానున్న సౌధంబునకుఁ దానెట్లు

వచ్చెనో యని యాశ్చర్యమొందుచు రాజుకొఱకుఁ జింతిం చుచుండెను. అంతలో నవమాలిక యరుదెంచి యామె నూ ఱడించి "సఖీ! ఆతఁడు భూలోకచక్రవర్తి యనియుఁ, బురు కుత్సమహీపాల నామధేయుండనియుఁ దెలియవచ్చినదిగదా! కనులార నాతనింగూడఁ జూచితిమి. కామగమనముచే భూ లోకమునకుఁ బోయి చూతములే" యని యామెను నమా ధానపఱుపఁ జూచెను. నర్మదయగ్గలపుఁదమి "సఖీ! ఆరాజిం కను నాయుద్యానవనంబుననే యుండును. చూచి తోడ్తేర" మ్మని యాజ్ఞాపించి యామెను బనిచె.

గంధర్వులప్పుడప్పుడు వినోదార్థము రగలోకమునకుంబో యి తల్లోక సౌందర్యంబుల విలోకించి యుత్సాహజనకంబు లగు మృగసంచయంబుల వేఁటాడి కొన్ని దినంబులందు హా యిగా సుఖించుచుండుటయుం గలదు. గంధర్వుల ప్రేరణం బున గంధర్వరాజగు చిత్రకేతుం డొకనాఁడురగలోకమున కువచ్చి మణిమయభాసమానములగు హర్మ్యంబుల సభా మంటపంబుల చిత్రంబులఁ గనుంగొని కనుగుట్టి మందారు నో డించి తత్పట్టణంబులంగల ధనంబునుఁ గొల్లకొట్టుకొని పోవఁ దలపెట్టి యప్రయత్నముగానున్న నురగరాజుపైఁ గవిసె. పరాక్రమవంతుండగు మందారుండ సంసిద్ధుఁడయ్యుఁ జిత్ర కేతునిపైఁ గవిసె. గంధర్వ సైనికులెల్లరు నురుగుల ముట్ట డించిరి. నాగలోకమంతయు నొక్క క్షణములో సంక్షుభిత

ఉ. మెచ్చితి రాజరాజ! వినుమీయొక మాటమదంఘ్రిభ[క్తిసం
పచ్చరితార్థుఁ డీయమర భర్తనిసర్గబలాధికుండ వీ
విచ్చితి నీకయిజ్జయము నింతియ కాదు వరంబునొక్క టే
నిచ్చితి నిన్ను నెవ్వఁడు జయింపఁడు పొమ్ము జగత్త్రియం[బునన్."

వెండియు గంధర్వరాజు పురుకుత్సుని మహామహిమంబు న కద్భుతపడి వాని వేనోళ్ళం బొగడి "నాగులయెడ సోదర భావంబున వర్తింతు" మని బాసచేసెను. నాగగంధర్వు లిరువుర మైత్రికిఁ గారణభూతుఁడైన పురుకుత్సభూపాలున కా నాగులనర్ఘమణి సందోహంబు గాన్కగా నొసంగిరి. నాగాధిపతియగుమందారుండు నిజోదారభావంబు మెఱయఁగొన్ని యమూల్యరత్నంబులను నొక కన్యారత్నమును దీసుకొని వచ్చి పురుకుత్సున కొసంగెను. ఉడుప్రకరంబుల శశిభంగి నారత్నములలో మిక్కిలి ప్రకాశమానమగు నాకన్యారత్న. మును రాజాదరముతో గ్రహించెను. రాజా కన్యారత్నము గు నర్మద నయోధ్యకుం గొనిపోయి వివాహమాడఁ దలంచెను గాని నాగులెల్ల రాముహొత్సవంబు కనులారఁ జూడవలెనని కౌతుక భరవ్యగ్రాత్ములగుఁ డందఱకు నిరుత్సాహంబు వొడమఁజేయుట నుచితంబని యాతఁడు వల్లె, యనె

సత్వరమా శుభవర్తమానము మాంధాతృమహీపాలున కెఱింగించిరి. కుమారుని పరాక్రమమున కాతఁడంతరంగం

బున నానందించుచుఁ దగు సన్నాహంబులతోఁ నాగలోకంబునకుఁ దరలివచ్చెను.

సేవకబృందంబు మందారునాజ్ఞ నాగలోకమెల్ల నాకలోకముగా నొనర్చుచుండెను. ఎందాలకించినను, పలుపటహాభేరీమృదంగాది మంగళతూర్య నిస్వనంబులే? పురము ప్రాగ్ద్వార వేదికానివేశితసముదీర్ణపూర్ణ కుంభంబును, గంభీరరంభాస్తంభసంభావనానంద నవమాలికానీకవిలసనంబును, విశాలవిజృంభితజగజ్జేగీయమానంబునై కన్నులపండువై చెన్నలరారుచుండె. కుంకుమపంకంబులఁ గుడ్యభాగంబులం బూసియు, ముంగిళులయందుఁ గస్తూరి నిస్తులంబుగాఁ గలయంపిగాఁజల్లియుఁ గప్పురంబున ముగ్గులఁబెట్టియుఁ గంబాలకుఁ జీనిచీనాంబరంబులఁ గట్టియు, మేడల ముత్యాల మేలుకట్లుగట్టియు నవవికసిత వివిధప్రసూన పరికల్పితతోరణపరంపర లెల్ల వీథులఁ దొంగిలింపఁ జేసియు నభినవశ్రీలఁ గై సేసిరి.

పురుకుత్సు మహీపాలునిఁ జతుర్దంతిసమసమద దంతావళంబుపై నధిష్ఠితునింజేసి మౌక్తికరంగవల్లీసుందరంబగు వైవాహిక మందిరంబు నడుమనడరు మరకతమణివేదికోపరికురువిందచరణాంచితకాంచనపీఠంబునందధివసింపఁజేసిరి. మాంధాతృ మహీపాలుండ మందానందకందళిత హృదయారవిందుఁడై వచ్చి పెండ్లిపెద్ద యాతఁడేయని జనులనుకొనునట్లు పెండ్లికొమరునిప్రక్క నిలువంబడి యాజ్ఞాపూర్వక దృక్చ

యంబుల నందందఁబఱపుచుండెను. మందారుఁడాగమ విధి సహితముగా మధుపర్కంబొసంగి ముద్దుకూఁతురగు నర్మదను పురుకుత్సమహీపాలునకు సాలంకృతంబుగా ధారవోసెను.

భూవరుఁడు గల్యాణ మహోత్సవముగావించి బంధు మిత్రామాత్యులకు విప్రబృందంబునకుఁ దత్తదుచితప్రకారం బునం బారితోషికంబుల నొసంగి వీడ్కొలిపె. మాంధా తృఁడత్యంతవినోదంబునం గొడుకును గోడలినిఁ దీసికొనివచ్చి న బంధువులతో మధ్యమలోకంబునకుం బయనంబయ్యె. మం దారదంపతు లనుంగుసుతకై యెంతయుఁ దల్లడిల్లిరి. రాజం త పురుకుత్సుని విలోకించి "నీవచ్చుటకు వచ్చుటకెంతయో కాలంబునట్టు. నాకుమార్తె కామగమన విద్యాప్రవీణురాలు. నీకిదే తద్విద్య నొసంగుచుంటి. పండుగపబ్బములకు మాయ మ్మాయినిఁ దీసికొని వచ్చుచుండుము మఱియును రాజ్యకార్య ముల కంతరాయంబు గలుగకుండ క్షణములో నీపురంబుఁజే రఁగల"వని యావిద్య వానికుపదేశించి పంపె."

మాంధాతృ మహీపాలుఁడనేక వత్సరంబు లానందంబున రాజ్యమేలి కొమరునిఁ బరాక్రమ, రాజ్యకార్య నిర్వహణాది సకలశక్తుల విలోకించి ప్రజలెల్లరిమనంబు లాతనిపైనుండుట యు గ్రహించి శుభలగ్నంబునందు వానిని సర్వమహీమండ లంబునకుఁ బట్టాభిషిక్తునిఁ జేసెను.

ఒకనాఁడు పురుకుత్సభూపాలుండు నిండు పేరోలగంబున నుండ

సీ. సరిగమపధనిస సంజ్ఞస్వరంబుల
మహతినభోవాయుని హాతి మొరయ
భాగీరథీపయఃపరిపూర్ణ మణికమం
డలువుహస్తంబునఁ జెలువు మిగులఁ
బ్రణవమంత్రావృత్తి పావనస్ఫటికాక్ష
వలయంబు కర్ణశష్కులిక వ్రేల
సమరనృత్యోచిత చమరవాలంబును
గక్షపాలయు భుజాగ్రమున మెఱయ

గీ. దేహకాంతు లకాలచంద్రికలనీన
జడలు మోక్షద్రుమపల్లవ శంక సేయ
గగనమునుండి వచ్చె నాకస్మికముగ
నారదుఁడు మూర్తిజిత శరన్నారదుండు."

వచ్చిన ముని కెదురేగి నమస్కరించి వినయబహుమాన పురస్సరంబుగఁ దోడ్కొని వచ్చి యిచ్చమెయి సచ్చరిత్రుల పాదసేవ సంతత శ్రేయోదాయకం బనునట్లు నాతనిం బూజించి "మునిశ్రేష్ఠా! మేఘోదయంబునకు లాంగలి చెంగలించు తెఱంగున మీరాక నాకనూనానంద సంధాయకమయ్యె. త్రిలోక సంచారులగు మీరెఱుఁగని విషయంబులుంగలవె? అందందుఁ గల సంగతు లామూలాగ్రంబుగా విన్నవింప వేఁడుచున్నాఁడ" నని ప్రార్థింప నానారదుండు భూపాలున కిట్లనియె. "రాజా! ఏమని చెప్పుదును. ఇంద్రునంతటివాఁడు పినుఁగురక్కసుల బాధకోర్వఁ జాలక నందనవనం
[illegible]

తయు నాకడ వెళ్ళఁ బోసికొని వాపోవుచుండఁ గొందఱు గంధర్వు లేతెంచి నీశౌర్యపరాక్రమకథాస్తోమంబు లొక్కుమ్మడిగాఁ బాడ నాతం డెంతయు సంతసించి నాదెస వీక్షించి "తాపసకులచంద్రా! ఆరాజు నెట్లైన నీనాకమునకుం గొనివచ్చి నాకు మహోపకారమొనర్పు" మని నన్ను వేఁడుకొనఁ గరఁగిన మనసుకలవాఁడనై నీకడ కరుగుదెంచితి. ఇంద్రునంతటివాఁడు నిన్నర్థించుటే చాలు! వాని మనోభీష్టంబు నెఱవేర్తువేని నీవింద్రాసనంబునం దుపవిష్టుండవు కాఁగలవని" వక్కాణించుచుండ విశ్వామిత్రుని వరంబును జ్ఞప్తికిరా నెంతయు సంతసించుచు రాజు మునివెంట నాకంబునకుఁ బయనంబయ్యె.

దాక్షిణ్యప్రీత్యాపేక్షల నపేక్షింపక ఘనులు లోకతాపంబు హరింతురుగదా! మునిచంద్రుఁ డారాజచంద్రు నింద్రలోకంబునకుం గొనిపోయి నిర్జరాధీశ్వరునకు నప్పగించెను. అమరాధిపతి యత్యంతసంతోషితస్వాంతుండై తన సరిగద్దియపై నునిచి యుచితాతిథేయసత్కారపరంపర లాచరించి యిష్టమృష్టాన్నకలన సంతుష్టుఁజేసి యాపై వానినటకు రావించుటకుఁ గారణంబు వచించుచుండెను.

అయ్యవసరంబునఁ బోతరించి యెల్లవేళల సురలోకంబు నాకకడకుఁ దెచ్చు క్రవ్యాదులేతెంచి యదృశ్యాకారులై "ఓరీ! నీ వంటి పిరికిపందఁ కిట్టి రాజ్యైశ్వర్యంబు లేటికి?

ఈపాటి కీడివి పీడిపొమ్ము. నీకొక జడఅబూచియు, నరకీట కమునా సహాయ మొనర్చువార"ని హేళనఁజేయ మొద లిడిరి. రాజు ధ్వని వినుటయేగాని యెవ్వరినిఁ గాంచకుండు ట కద్భుతపడి తడవుసేయుట కనువుగాదని యెంచి యాతఁ డమ శస్త్రాస్త్ర సహాయుండై విబుధులు వెన్నంటిరా నా యదృశ్యాకారులపై ధ్వని ననుసరించి యస్త్రములఁ బ్ర యోగించుచుండె. వారును గర్వంబునఁ గన్నుఁ గానక సిం హనాదంబులు సేయఁ దొడంగిరి. పురుకుత్సభూపాలుండు ద్విగుణీకృతధైర్యుండై యొక్కపెట్టున నరుల నుఱుమాడు చుండెను. ఇంద్రుఁడును వాని యండనుండి విరోధిగణంబులఁ ద్రుంచుచుండెను.

రాక్షసులెల్లరుఁ బురుకుత్సుని ధాటికాగలేక సాధన చయంబుల విసర్జించి వాని చరణ పద్మంబులను బట్టి రక్షిం పవేఁడుకొనిరి. దయామయుండగు ఱేఁడా రక్కసుల నాద రించి వారి ప్రాణంబులం గాచి వారొసంగిన సత్కారంబుల నంది వీడ్కొలిపెను.

గీర్వాణవల్లభుం డుల్లంబునఁ బొల్లు సంతసిల్లి రాడ్వల్లభు నిం గౌఁగలించుకొని యాతం డొనర్చిన యుపకారమునకుఁ గృతజ్ఞతాపూర్వకంబుగా ననేకాభరణకాంచనాంబరాదు లొసంగి వీడంజాలక యాతనికడ నుంచుకొనియె.

మధ్యమలోకంబున సాకేతపట్టణంబునఁ బ్రజలెల్లరు రా

ఘోరలేమి విచారమనస్కులై రాజదర్శనములేని కుముదినుల కరణివాడియుండిరి. మంత్రిపుంగవుండు చేయునదిలేక, యమరలోకంబునకుం బోవ సమర్థత చాలక యాతండును ఖిన్నుండై యుండె. క్రమక్రమముగా నీవార్త నర్మదాదేవికిం దెలియఁ బురప్రజల యనురాగంబునకు మెచ్చి వారి విచారమునకుం గుంది "నేనిదే రాజుం గైకొని వత్తు"నని చెప్పి వారి నూరార్చి తన కామగమన విద్యాప్రభావంబు మెఱయ నమరలోకంబున కరిగె. ఆరాకం గని రాజును దేవతలాశ్చర్యచకితులుకా నామె తన రాకకుఁ గారణ మెఱింగించె. శచీంద్రు లిర్వురు నానర్మద యంతఃకరణశుద్ధికిని, సద్గుణంబులకును గడుంగడు సంతసించి రాజు నింకచట నిలుపుట భావ్యంబుకాదని యెంచి వారిరువురం దన విమానంబుపై నెక్కించి మధ్యమలోకంబున డించి వచ్చునదిగాఁ గొందఱమరనాయకుల కాజ్ఞాపించి పంచె.

మఱునాఁడు నర్మదాపురుకుత్సు లౌత్సుక్యంబు మెఱయ సాకేతపురంబున కరుదెంచిరి. పురజనులెల్లరా దంపతులం గాంచి యమందానంద భరితులైరి.

కొంతకాలంబున కా నర్మదాపురుకుత్సుల కఖండపుణ్యారాశియగు త్రసదస్యుఁ డుదయించెను.

---

# పురూరవుఁడు.



సీ॥ చంద్రనందనునకు సాధ్వియిలాకన్య
యందుద్భవించెఁ బుణ్యములతోడ
శ్రీమత్సురాంగనా సీమంతమణియైన
యూర్వశిపత్నిగా నుర్వియేలె
వితతభాండాగార విపులగోష్ఠాగార
తతివిప్రహస్త సంగతిగ నిచ్చె
ఆయుర్దృఢాయుస్సు ఖాయురుముఖుల దేవ
పతిచూచి వెఱఁగంద సుతులఁ బడసె

గీ॥ ప్రకటశాత్రవభంజన భైరవుండు
పాత్రతాయత్త కౌరవ పౌరవుండు
హర్షితానేక జనవినుతారవుండు
గౌరవోన్నతి నొప్పెఁ బురూరవుండు.

క్షీరవారాశియందు సహస్రఫణాఫలక ప్రభాభాసమానుండగు నాదిశేషునిపై యోగనిద్రాసక్తుఁడై పరబ్రహ్మానంద సుఖానుభవుఁడై శయనించియుండు శ్రీమన్నారాయణుండు నిజనాభికమలకోశంబున బ్రహ్మను సృష్టించి వానికి సహాయంబుగా భృగు, పులస్త్యపుల, హాంగిర, సాత్రి, క్రతు, దక్ష, వసిష్ఠ, మరీచ్యాది నవబ్రహ్మల సృజించెను. వారిలో నత్రి బ్రహ్మకంటినుండి బృందారకబృందంబునకు విందొసంగు నమృతరసపూరితాక్షయరజతపాత్ర నాఁదగు ను

త్కృష్టకాంతివంతుఁడగు చంద్రుఁ డుద్భవించి రూపరేఖాత్యు దారయు, సుగుణవిస్తారయు, మోహిని యపరావతారయు నగు తారను గ్రహించి యశేషవిశేషగుణాంబుధియగు బుధునిం గనెను. ఆబుధుండును విబుధాశ్రమంబులకుం బోయి శ్రీమన్నారాయణునిఁ గూర్చి భూరితపం బొనరింప మొదలు పెట్టెను.

వైవస్వతమనువు సకలధారుణీమండలమున కధిపతియై యొక్కనాఁడు నిజరత్న కాంచనతురంగమతంగజధేను దాసదాసీజనమందిర విచిత్రదుకూలభాసురాంగ నాసంచయోజ్వలమగు విభూతిఁ గలిగియుండియుఁ దనూభవహీనతకుఁ దద్దయు విచారించుచుఁ గులగురుండగు వసిష్ఠునిఁ బ్రార్థించి వాని యనుమతిఁ బుత్రునిఁ గాంచుటకొక యధ్వరంబుఁ గావింప నిశ్చయించుకొనెను. మఖోచితసంభారంబులెల్ల సమృద్ధిగా సిద్ధపఱుపఁ బడెను. మంత్రతంత్రకలాపపరిశుద్ధ కలిగిన విప్రులేతెంచి యనల కుండంబుల హోమంబుచేయు సమయంబున వైవస్వతుని భామిని శ్రద్ధాదేవి కూఁతురు కావలెనని సంకల్పించి చేయుచుండెను. ఆమె కోర్కెప్రకారమొక నవమోహినియైన కన్య యుదయించెను. ఆమె కిలయని నామకరణం బొనర్చిరి. వైవస్వతుఁ డక్కన్యం గాంచి "అక్కటా! కొడుకుదయించునని మించిన వేడ్కనుండ నాఁడు బిడ్డ జనించె. ఔరా! దైవయత్నముఁ గడవ నెవ్వరికైన

శక్యమే” యని చింతించి వసిష్ఠుఁ జేరఁ జని భక్తితో మ్రొ
క్కి “అనఘా! ఏను పుత్రునిం గోరి యజ్ఞ మొనర్చుచుండ
నేదోషంబునం జేసియో నాహృదయోత్సాహభంగకరంబు
గాఁ గొమార్తె యుద్భవించె. కులవర్ధనంబును, జననీ జనక
సుఖదాయకంబును నిహపర సాధనంబును బంధుజనాదరణం
బునగు పుత్రసంతానమువలనఁ గాక కూఁతును గనుటవలన
ఫలమేమి” యని యనవుడు సంయమిప్రవరుఁడు యోగదృ
ష్టిచే మనమునఁ గాంచి మనువుతో “రాజా! నీసతి సంకల్ప
వైపరీత్యమున నిట్టి యవకార్యము జరిగెను. కానిమ్మోను దీని
కిం దగు ప్రయత్నం బొనరించెద”నని నిజభక్తానందకరుండ
గు విష్ణు నారాధనము సేయఁ బాంచజన్యసుదర్శనప్రముఖ
సాధనంబులతోఁ బతగేంద్ర వాహనుండై నారాయణుండు
ప్రత్యక్షమయ్యె.

ఆనందాశ్రులు కన్నులం దొలుక వసిష్ఠుఁడు సాష్టాంగం
బుగా మ్రొక్కి “దేవా! వైవస్వతమనువు పుత్రోత్పాదనా
ర్థంబు యజ్ఞం బొనరింపఁ బుత్రిక యుదయంబయ్యె. వానికిం
బుత్రదానం బనుగ్రహింపవలయునని” ప్రార్థింప విని వసిష్ఠు
నియందలి ప్రేమాతిశయంబున నక్కూఁతురు కొడుకౌనని
యానతి నొసఁగి హరి యంతర్ధానుం డయ్యెను. ఆ సమ
యంబున

సీ. కొదమలేళ్ళకు సిగ్గుగొలుపు వాల్గన్నులు
తరుణారుణాబ్జ సుందరములయ్యెఁ

గరికుంభ . . .మనోహరమైన యురము ని
రర్గలకాంచన కవాటరమ్యమయ్యె
మవ్వంపుఁదీఁగెల నవ్వుచేతులు మత్త
మాతంగ శుండాసమంబులయ్యె
మధుమానపికరవమధురకంఠము మేఘ
గంభీరనిస్వనకలితమయ్యెఁ
గీ॥ బొదవు లజ్జాభయంబుల నొదుఁగుమనసు
ధైర్యశౌర్యనిరంకుశత్వము వహించె
నయ్యెలాకన్యకును నీశ్వరాజ్ఞవలనఁ
బ్రాప్తమయ్యెను బౌరుషభావమపుడు"

వైవస్వతుండు వసిష్ఠానుమతంబున నక్కుమారునకు సు
ద్యుమ్నుండని నామంబిడి సకల విద్యాపారంగతునిఁ జేయిం
చెను. గజతురగారోహణము, కార్ముకబాణకృపాణ చక్రతో
మర ముసలాదిసకల సాధనపరిశ్రమము, భూభరణ రణప్రవీ
ణత, మొదలుగాఁగల సర్వము నాతని కచిరకాలమునందే
పరిచితము లయ్యెను.

ఒకనాఁడు రాజ తనూభవుఁడును వేఁటకాండ్రును, గాం
తారాంతరంబులకు వేఁటకుంబోవఁ బయనంబైరి. శుభలక్ష
ణలక్షితంబై జితకురంగమన వెలుంగునొక తురంగము నెక్కి,
యల్పులకుఁ బ్రభుత్వంబు వచ్చినచో మనుష్యులను వికార
పుంజూపులఁ జూచినరీతినున్న రోషభీషణములగు జాగిలమ్ముల
వెంట నిడుకొని చనిచని సింహసంచయవహనంబును, జన

సంచారక గహనంబునగు నొక గహనముఁ బ్రవేశించి యు
జ్జనాధాత్మజుఁడు మృగవ్యక్రీడలం గొంతకాలంబు గడిపి
గంధర్వయానాతిశయంబున నహరహ ప్రదక్షిణ పరిచరద్గ్ర
హ తారకానిచయ ప్రతిబింబవిడంబి తన్నితంబబింబపరిస్ఫురి
తంబగు మేరుమహీంద్రంబుఁగాంచి తదీయవైభవంబున క
ద్భుతమందుచుఁ దత్పర్వతోపకంఠంబునందుఁ గుమార వన
ముంగాంచి యమ్మహోపవనసీమలఁ జరింపఁదలంచి మిం
చిన వేడ్కఁబోవుచు, నిజవయస్యాజనంబుతోఁ జతురోక్తు
లాడుచు నిరంకుశత్వంబున మెలంగుచుండె.

దూరీకృతపరిమదాంధద్విపదైత్య బాహుబలసంరంభుఁడ
గు శంభుఁడు తదారామంబునఁ బ్రియదారత్నమగు పార్వతి
తో సరససల్లాపములాడుచుండె. అక్కడతన నాచోటికెవ్వరుం
జొరరు. చొచ్చినతోడ మగవాఁడాడురూపు నొందును.

పాపమా సుద్యుమ్నుఁ డావృత్తాంత మెఱుంగక యువ్వ
నంబుసొచ్చినంత

సీ॥ శ్మశ్రుకళంకదోషంబు నిశ్శేషమై
ముఖచంద్రబింబంబు ముద్దుగులుక
వరవీరరసరజోభరణంబు హరణమై
నేత్రాబ్జధవళిమ నివ్వటిల్ల
నుష్ణీషపేటికా యుక్తివిముక్తియై
కచనీలమణిగణకాంతిదనర
జ్యాకిణాంక మిళిందసహితంబు రహితమై
కరపల్లవచ్ఛాయ గడలుకొనఁగఁ

గీ॥ బటుతను తాఁ ణశుక్ర్యపవారణముని
వారణంబై శరీరలావణ్యమౌక్తి
కద్యుతి వెలుంగఁ బురుషలక్షణము వెడలి
యక్కుమారుండు నవమోహనాంగియయ్యె॥

సుద్యుమ్నుండు విద్యుల్లతాంగియై విస్మయ విషాద వి హ్వాలమతిం దిరుగుచు దైవయోగమున బుధుని యాశ్రమం బునఁ గేయూరకిరీట కుండల ముఖోజ్జ్వల భూషణాద్యలంకా రు, మందహాసముఖకాంతి నిర్జితరాకాశశాంకు, వినతసర్వ బుధుబుధుఁగాంచి రాగరసార్ద్రాంతరంగయగుచుఁ గనుఱె ప్పవెట్టక చూచిచూచి "వీని మార్తాండ తేజోనిరూఢి, వీని వసంత మోహనవిలాస మేలతాంగుల నలరింప" దని విమోహి తాత్మయై యుండె.

అసామ్యసౌమ్య సద్గుణరమ్యుండగు సౌమ్యుం డానవ లావణ్యవిలాస మోహిని నవలోకించి విదళితహృదయుండై యామదవతి నానతిఁబడసి గాంధర్వవిధి వివాహంబయ్యె. అంతంగొంత కాలంబునకా కాంతముఖాబ్జము వెలవెలఁబా ఱ, దృగంచలంబలసావిలాసముకాఁ దనూలత చంచలానూ పమంబుగాఁ జెక్కులు తెలుపువహింప నవాంగములు తేలి కలుకాఁగ వాక్కుల యలపు ఘటిల్ల గర్భంబుఁదాల్చి నవ మాసానంతరమొక బాలకుంగనియె. ఆసమయంబున గంధ ర్వ గీర్వాణచారణ విద్యాధరులు పుష్పవర్షంబు గురిపించిరి. బుధుఁ డుదారముదావహచిత్తుఁడై పుత్రోత్సవము సేయిం

చి యోగిజనుఁ లితఁడఖండ సంపత్సముపేతుఁడై సుధాంశు కులవర్ధనుఁడై యనేక వత్సరములు నేల నేలఁగలఁడ"ని నిర్ణయింప మంగళాసనము లాచరించి పురూరవుండని యభిధానంబొనరించిరి. దినదినప్రవర్ధమానసితపక్షపాకరునికై వడిఁ బ్రివర్తిత రమణీయ శైశవశరీరవిరాజితుఁడై యశేషవిశేష గుణాభిరాముఁడై పురూరవుఁడు వెలుంగుచుండె.

ఈచందంబునఁ గతిపయవాసరంబులరుగ నాభ్రిమరాలక యొక్క నాఁడాత్మవర్తనము చిత్తమునందలపోసిపోసి కేవలసమాధినిష్ఠనూర్జితకరుణాది సద్గుణగరిష్ఠుండును, వరిష్ఠుండగు వసిష్ఠునిఁ దలఁచినఁ బరమకరుణార్ద్రస్వభావుఁడగు నాతఁడు రా వాని పదాబ్జయుగమునకు మ్రొక్కి యవనతముఖయై "మునిచంద్రా! మోహనమధురోక్తుల శంభుఁడు భవానితో నుత్తరములాడుచుండు సమయంబున సందీపితానేక మార్తాండ స్ఫూర్తిత తేజుఁడగు శివుని సందర్శించు తలంపుతోఁ గౌండిల్యాత్రికశ్యపగౌతమవ్యాస మార్కండేయాది మహామునీంద్రులు వచ్చిరఁట. వారలరాక వివస్త్రశరీరిణి యగు శర్వాణి సిగ్గునఁ దొలంగి చీర ధరించినం జూచి య ది యదను కాదని యెంచి మఱలరాఁదలంచి వారు రయంబున వెడలిపోయిరి. పార్వతియుల్లంబునఁ గడులజ్జనొంది మోమెత్తి శూలింజూడకయున్ననాతఁడా మోఁజీరి" తరుణీ! ఇక్కమారవనమన్యులుప్రివేశింపరాదు. ఏపురుషులేని వచ్చి

రేని౯ బౌరుషంబెడలి నేఁడాడిగ స్త్రీకాదురు" అని శపించెనఁ టఁ. తత్కారణంబున నేనిట్లైతి. నాపురుషత్వప్రాప్తికే నిట్లు మిమ్ములఁ బ్రార్థించుచుంటి"నని దీనాననయై విన్నవింపనాతఁ డామె నూఱడించి సంకల్పసంజ్ఞ నవ్యాళవిహంగపుంగవు శివు నారాధింపఁ బ్రమథగణంబులో భుజంగహారకదంబకంబులో నమరధుని తరంగలులనాత్త జటాపటలంబులో నీశుడు బ్ర త్యక్షమయ్యె. వాని ననేక భంగుల నుతింప విశ్వగురుండగు హరుండు "వశిష్ఠా! నీసంకల్ప మేనెఱుంగుదును. నావచనమ మోఘంబు. అది మాన్పుటకల్లదు. ఉభయార్థ సాధకంబుగా నొక్కటిమాత్రి మొనర్చెద. ఇతఁ డొకమాసము పురుషుండై యుండి ధరణీ సామ్రాజ్యభారంబు వహించి మాసాంతరము నఁ దరుణీమణియై వర్తించు నిది తప్పదు." అని వచించి వసి ష్ఠవందిత పదాంబు రుహుండై యంతర్ధానమునొందె.

అరుంధతీవల్లభుఁడు జగజ్జన నయనకైరవుండగు పురూ రవుం దోడుకొని ప్రతిష్ఠాన పురంబున కరుదేర వైవస్వతుఁ డు పరిచారకుల నియోగించి యపూర్వ విలాసంబుగా నగ రం బలంకరింపఁజేసె.

మునిశేఖరుఁడు రాజకుమారునకు సాంగంబుగా సమస్త విద్యలుపదేశించె. కాంచనంబునకు నవ్యవికాస పారిజాత ప్ర సూనగంధమబ్బినభంగి వాని కనితర ప్రతిపాదక విష్ణుభక్తి యలవడియె. ముని వాని సామర్థ్యంబు నరసి యఖిల జగ

త్సంచార సామర్థ్యంబును, నభేద్యకవచంబును, నణిమాద్య ష్టసిద్ధుల నొసంగి నిజాశ్రమంబునకుం బోయె. వైవస్వతుని యనంతర మొకనెల రాజును, వేఱొకనెల రాజాననయునై ధరాపరిపాలనంబు చేసి కాలక్రమంబున వృద్ధుఁడై భోగప రంపరలఁ ద్యజించి సుద్యుమ్నుఁడు పురూరవుని రాజ్యాధిష్ఠు నిగాఁ జేసి యొక పుణ్యాశ్రమ సీమను దపోనిష్ఠమై నుండెను.

పురూరవుఁడు రాజ్యాభిషిక్తుఁడై భువనప్రజావన ప్రవ ణుఁడై, యచలధర్మోజ్జ్వలుఁడై, పారిజాతభూజాతమని జను లు పొగడఁ జెంపొందుచుండె. అతఁ డొక్కనాఁటి దిగ్విజయ ము చేయనెంచి పటహాఘూర్ణితధ్వనిచే దిక్కులు గగ్గోలు పడఁ జతురంగబల సమేతుఁడై బయలువెడలె. తత్ప్రవిధా టికి సింధుపతి భంగంబునొంది పాఱె. మాగధుఁడు నుతింప మొదలుపెట్టె. కాళింగుఁడు మూనమొల్లవదలె. మత్స్యుండు వనవాసమొనర్చె. విదేహుఁడాత్మాంగబలంబులేమి బెగ డొందె. కుంతలుఁడు చిక్కుల పాలయ్యె. కాని శకభూపా లుఁ డవార్యదోర్వీర్యబలంబునఁ బురూరవు నెదిరించి పోరఁ దొడంగెను. వసిష్ఠపాదాబ్జ శుశ్రూష నార్జించిన ధనురాగ మమెల్ల నావైరినెడ నెఱపి వాని గర్వంబు సర్వంబు నణఁచి కృపాళుఁడగుటను, బరపరాక్రమాభినందనుఁడగుటను, వాని రాజ్యము వానికిచ్చి గగన యానంబున నంబుధులుత్తరించి సకల ద్వీపంబుల వశముచేసుకొని నానాద్వీపనృపార్పిత

మాణిక్యముక్తాఫలాదిమాత్నరత్న సందోహంతో నుద్య
ద్వైభవములతో నిజపురంబున కరుదెంచెను.

ఒక్కనాఁ డనిమిషసభ దేవేంద్రుఁడుత్కృష్టప్రతాపుఁడై యుం
త నారదుండు పురూరవుని ధైర్య, పరాక్రమౌదార్యాది స
ద్గుణంబుల నామూలాగ్రంబుగా రంభచిగురొత్తుకరణి, హే
మకరఁగురీతి, మదాలసచొక్కుమాడ్కి, హరిణచకితయా
తెఱంగున, శశిరేఖరసార్ద్రమగుభంగి వర్ణింపఁ దొడంగె. అ
ట్టియెడ భువనమోహనవిలాస నిజకటాక్షానీక విజితకుసుమ
ధన్వచార్వసియగు నూర్వసి పురూరవకథాసుధార్ణవాంతర్ని
మగ్నాంతరంగయై యానరనాధుని చక్కదనంబును, నమ్మ
హామహుని ప్రాజ్ఞతయుఁ గన్నులఁగట్టినట్లుకా, నమరసభ
నున్న యామె కొలువు చాలించి శుద్ధాంత నిలయంబునకుఁ
బోయి దివ్యహంస మృదుతూలాతల్పంబునఁ బవ్వళించి యా
నృపాలుని యందచందంబులఁ దలంచి యిట్లు తలపోయఁ
జొచ్చె

"ఉ॥ ఏటికిఁ జెప్పె దాపసి నరేంద్రుని పెంపుసురేంద్రుతోడ నే
నేటికి వింటిఁ దద్గుణములెల్లఁ బరాకొకయింతలేకనా
కేఁటికిబుట్టె వానిపయి నెంతటనంకెకురాని ప్రేమ న
న్నేటికి నప్పగించెఁ గుసుమేషునిబారికి దైవమక్కటా!

ఉ. ఎన్నఁడుచూడఁగల్గెడునొ యిందుకులాగ్రణిముద్దు మో
[మునా
కన్నులుచల్లగానతనిఁ గౌఁగిటఁ జేర్చి సుఖాప్తిఁ జొక్క ఖా

గ్యాన్నతి కల్గునో కలుగదో వలపెంతట నేమి సేయఁగా
నున్నదొ దైవయోగమెటులున్నదొ దీనికుపాయమెద్దియో.
మ॥ మదినంతంతకు నగ్గలించు బలుపేర్మిన్ దాళరాదేమి సే
యుదు, నేయత్నముచేత వశ్యుఁడగునాయుర్వీశుఁడేనోమునో
ముదు నేదైవము వేఁడుకొందునిఁక నీమోహాబ్ధికిన్ మేరయె
య్యదినాకెవ్వరు ప్రాణబంధులు మహీయాసక్తి యీడే
[ర్పఁగన్॥"

అని చింతించుచుఁ గూర్మి నెచ్చెలులం గనురెప్పలెత్తి
యైనంజూడక పీసులవిందుగాఁ బాడక పట్టెడన్నమైనం జేప
ట్టక యెవ్వరితోడను మాటాడక వాడిన మోముతో వీడిన
ధమ్మిల్లముతో వెచ్చని యూర్పుగమితోఁ జెమటవానలం
దోఁగిన యంగకంబులతోఁ గరాబ్జమును గూడిన కపోలము
తో వగలఁగూరెడు చిత్తంబుతో బెగడొందుచుండె.

ఆసమయంబునందాదారి నొకశుకమిథునంబుపోవుచుండె.
శుకాంగన యాలతాంగి చక్కదనంబు వీక్షించి దుఃఖభా
రంబునందూఁగు నాకృశాంగి నవలోకించి కరఁగిన మనస్సు
కలదై "నాథా! ఈసుందరాంగినిఁజూచిన నాకెంతయు జాలి
కలుగుచున్నది. మీారెఱుఁగని కార్యములీ యుర్వీస్థలినెం
దును లేవు. నేవినఁదగుదునేని నీపె యెవ్వతెయో యెందుల
కిట్లెంగునఁ జింతాభరాక్రాంతయై యున్నదో తెల్ప వేఁడెద"
ననియె. ప్రియురాలి వాక్యము లాలకించి ప్రియంబెసఁగ శు
కమాయెతో నిట్లనిచెప్పఁదొడంగె. "కాంతా! పరమపావనం

బైన బదరికా వనంబున నారాయణ యోగీంద్రుఁడత్యుగ్ర తపం బొనరించుచుండ హావభావ విలాసముల నెఱపు నప్సరాంగనలనంపి యాతపంబుఁ జెఱచిరండని దేవేంద్రుఁ డానతీయ వారును శృంగారమమూర్తీభవించెనా యనునట్లలంకరించుకొని యానారాయణయోగీంద్రుని కడ కేగి వానిమ్రోల మెలంగ నాతఁడువారలం గాంచి మందహాసంబుచేయుచు నఖాగ్రంబులం దన తొడఁజీఱి విలసత్తారుణ్యసంపన్నయు, భువనైకగణ్యయునగు నివ్వారారోహను గల్పించె. అంత నయ్యచ్చరలెల్లరు వ్రీడాంభోధిమగ్నలై యుండ నామునిచంద్రుఁ డాచంద్రముఖులంగాంచి మీరాయాగడములీ యోగీంద్రుని కడనా? మీరే సౌందర్యవతులని కాఁబోలు! పోపొఁడు మీవేయికన్నుల వేల్పుకడ"కని కసిరికొట్టె. వారును లజ్జాభయంబుల మునుగుచు వెడలిపోయిరి. తన యూరువున జనించినదగుట నామె కూర్వశియని నామకరణం బొనరించి "అమ్మాయీ! నీవనిమిషభామినులకెల్లరకుఁ దలమానిక మవుదువు పొమ్మ" ని యాజ్ఞాపించె. నాటంగోలె నీనాతినాకంబునం బేరుపెంపు వహించియున్నది. ఇటుండ నారదుఁ డొకనాఁడు దేవేంద్రునితోఁ బురూరవుని రూపురేఖావిలాససద్గుణపరంపరల వర్ణించి చెప్పుచుండ నీమె విన్నదియై వానిని వలచి యాచందంబునఁ దపించుచున్నది!"

జీవితేశ్వరు వచనంబులు జీవితేశ్వరి యాలకించి యామె

రూపంబును పురూరవుని సౌ ందర్యంబును జిత్తంబునఁ దలపో
సి యాయిద్దరకును మిక్కిలి తగియున్నదని వచించెను.

తచ్ఛుకమిథున సంభాషణల నాకీరభాషిణివిని వారివాగ్వి
శేషంబున కద్భుతమందుచుఁ బ్రార్థనావచన పూర్వకప్రాం
జలియై

ఉ. కేళికినై శుకాకృతులఁగిన్ ధరియించి మెలంగు నాజగ
న్మ్మాల నిదాన దంపతుల ముప్వురిలోపలనొక్కరోదయా
శీలతమన్మనోరథము గేరి యొసంగగఁ వచ్చినట్టి నా
పాలిటి భాగ్య దేవతలఁ పల్కుఁదగుఁగా భవదీయవృత్తమున్"

అని వినయంబున వేఁడుకొన దయాంతరంగయై యాశు
కాంగన జీవితేశ్వరునిఁ బ్రార్థించి "యీయింతికి శుభంబు
గూర్పుడని" వేఁడుకొన నాతఁ డామె కోర్కెఁ దీర్ప నంగీ
కరించి యూర్వశి దెస వీక్షించి "ఓయూర్వశీసతీ! ముక్తిని
వాసంబైన బదరికావనము మానివాసము. మాదెల్లవేళల
సత్ప్రచారము నీకు శుభంబగును పొమ్మ" నిన నూర్వశి శం
కాతంకమనస్కయై "యో పికవల్లభా! నాకోర్కె యెట్లీడేఱు
నోకదా" యని దీనాననయై యడుగ నాశుక మిట్లనియె.
"పాకశాసన నియోగంబున నీవు భువి కేగఁ గలవు. సర్వగు
ణాభిరామనృపచంద్రుఁడగు పురూరవునిఁ గాంతువు. ఆతఁడు
ను నీపైఁ గడుఁగూర్మివహించు నియ్యది మదాశీర్వచనము.
నీపుణ్యంబులీడేరు."

సత్ప్రథులు నిర్హేతుక జాయమానదయాపరులుగదా!

ఆశుక మిథునంబు చక్రవిభ్రమణలీల లెసఁగించుచు నంబరవీథి నేగుచుండ నాయూర్వశి చూపు లదృశ్యావధికము గా నరిగి తిరిగి వచ్చెను. గుణవంతులకు సాధులగు బంధువులను సాగనంపి వచ్చు టుచితంబుగదా!

అంత నామె యాదినంబువృచ్చి యామఱునాఁడు నిజమందిరంబున ముంజేయి కపోలము నానుకొని కూర్చుండి గతరాత్రిఁ గాంచిన కల జ్ఞప్తికిఁ దెచ్చుకొని యాత్మగతంబున "భూలోకమున కేగుటకు నాకేమి పనిగల్గునో? ఆయింద్రుఁడనుజ్ఞ నాకేయిడునో మఱేపడఁతికైన నొసంగునో? ఒకవేళ నాకే యనుజ్ఞ నిడుచో నారాజేంద్రుని దర్శనంబెట్లు ఘటిల్లు! కల్గుచో నాతఁడు నాయనురక్తికి వశంగతుఁ డౌట కుపాయమెద్ది? ఉపాయమే తోఁచకున్నఁ జిల్కపల్కిన పల్కులనృతంబులౌనె? కానేరవు! నాకావించు నోములసమాప్తియందు దీవించు కల్యాణుల దీవన లూరకపోవునే? ఔరౌరే! ఇదియును విశ్వసనీయమగు శుభసూచనము! మదీయ వామలోచనం బదరుచున్నదని తలపోయుచు దినములొకరీతిఁగా గడపుచుండె.

బుధవర్యులగు మిత్రావరుణులు కాయలుపండ్లు నాహారముగాఁ జేసికొని యనిమిషంబైన దృష్టిచే నంబురాశి సమీపస్థ పుణ్యక్షేత్రంబునఁ దపము సేయుచుండిరి. తత్తపోగ్ని జ్వాలలకు విశ్వంబంతయు వ్రేఁగుకఁ జలింపఁ జొచ్చె. లోక

ములకాతపము దురాలోకమయ్యె. తన యాధిపత్యమున కేమి ముప్పు వాటిల్లునో యని విచారించుచుఁ దత్తపంబునకు విఘ్న మాపాదింపవలయునని తలంచి యాపురుహూతుఁ డందఱిలోన జాణయు నతిసౌందర్యవతియునగు నూర్వశినిఁ బిలువఁ బంచిన రాజవదనసందర్శనోత్సుకతఁ దదేక నిష్ఠతో నున్న నారాజవదన సంతసము సంశయసంభ్రమము లొక్కుమ్మడి యంకురింప మణిభూషణోజ్జ్వల శరీరయగుచు దేవేంద్రుని పేరోలగంబున కేతెంచెను. వచ్చిన వనజాయతాక్షి నీక్షించి యమరాధిపుఁ "డింతీ! భూలోకమునఁ బావనకాననంబున మిత్రావరుణు లత్యుగ్రతపం బొనరించుచున్నవారు. నీచాతుర్యముచే వారి నియమమునకు భంగంబు గావించి నీచంచలాలతికాహంకరణాపహాసకరలీలాలాలసాపాంగసంగతశోభాబ్ధి వీచికానికాయంబుల నాయతిరాజన్యతపోగ్నిజ్వాలలఁ జల్లార్చి యుపకారంబు సేయు" మని యాజ్ఞాపింప భూలోకమనుమాట వినినతోడనే "మహాప్రసాదంబని" యాపని యెట్టులగునో యని చూడకయే, వానికడ సెలవుగైకొని యిలు సేరి, సకలాభరణ భూషితాంగియై మునుల యాశ్రమమునకుఁ బోయె.

అయ్యెడ సకలసౌకర్యాలవాలంబైన శరత్కాలంబు. పాలకడలినట్టనడుమ సహస్రఫణాఫణీంద్ర భోగశయ్యాతలంబున భువనకర్త యగు కమలనాభుండు మేల్కని లేచి కూర్చుం

డె. ఏఱుల తీరంబులు నీరపూరంబులై పొంగారఁ దొడంగె. మిన్నులచ్చి కుత్తుకహత్తుకొనివేసిలు ముత్తెపుసరులు నా నం చగముఁలు కొంచక సంచరించుచుండె. సస్యములు ఫలోన్ము ఖములయ్యె. అత్తఱి నూర్వశీ మత్తద్విపయానహత్తినవేడ్క వియత్తలమునుండి భూతలమునకుడిగ్గి ఋషిప్రవరాశ్రమ సీ మచేరి యధికనిష్ఠఁ దపమొనర్చు తపోధనులఁ గాంచి వారి తపంబునఁ కంతరాయంబు గల్గించు నుపాయంబు భావించి సంగీతప్రసంగంబెసంగించు నుత్సాహంబున గవిసెనఁ బా యఁగాఁ దివిచి, సారెలొత్తి తంత్రులు మేళగించి పల్లవమ్మృ దులాంగుళిచే నారోహణావరోహణతలింపు గులుక, శిలలు ద్రవింప, దారువులంకురింప మృగంబులును జొక్కవహింప గానప్రవీణయగుచు వీణ వాయించె. ఆమునివర్యులు ధ్యా నానందనిమీలనంబులగు కన్నులు విచ్చి తమోవినీలకచను, దరళవిలోచనను, దటిన్నిభగాత్రవల్లరిని, దరుణశశాంకఫాల ను దరంగవళిని దలోదరినిఁ జూచి యామె చక్కదనంబున కక్కజమందుచుండిరి. అంతఁ గొంతవడికిఁ దెలివివహించి యామునులు తపోంతరాయంబునకు వగచి కోపించి "ఓమా నినీ! నీవు దివిజలోకవిదూరవై యీభూలోకంబుననేయుం డు" మని శపించిన విరహాబ్ధినిమగ్నయగు నామె యప్పటికి సంతసించియు దూరదృష్టిగల యవ్వనిత తరువాత నివ్వటిల్లు విచారంబున "మునిశ్రేష్ఠులారా! నాతప్పు మన్నించి నన్ను

శాపవిముక్తనుగాఁ జేయు"ఁడని వేఁడుకొనినఁ గరుణాన్వితు లై "కతిపయ దినంబులు భూలోకమునుండి యమరావతిఁ బూర్వస్థితినుండఁగల" వని మును లనుగ్రహించిరి.

అంత నక్కాంత చింతారహితస్వాంతయై పుణ్యతీర్థవరంబును, ఘోరపాపహరంబును, త్రిలోకపావనంబును, సర్వ సిద్ధికరంబునగు గంగాతటంబునఁ దిరుగుచు వందంము శోభలం దిలకించుచుఁ దన మనోరథం బీడేర్పుమని గంగను బ్రార్థించుచుండె.

ఉదగ్రపరాక్రముఁడగు పురూరవుఁడు ద్వాదశినాఁడు ప్రామాదికమున నభ్యంగస్నాన మాచరించె. ఆచరితంబుచే నాభూకాంతునివదనము కళావిహీనంబయ్యె. దానికెంతయుఁ జింతించి భూసురులతో నాతఁడు సంప్రశ్నించిన వారు సంచిత కిల్బిషధ్వాంతచ్ఛటాచ్ఛేదన ప్రారంభ భాస్కరోదయ మగు మాఘస్నానమునఁ బూర్వరూపంబు వడయఁ గలవని బోధించిన సకలాఘవిభంగయగు గంగకుం బోవఁ బయనం బయ్యెను. రంగదుత్తుంగభంగయగు గంగంగనుంగొని స్నానంబు లాచరించి నానావిధ దానంబు లొనరించి యనంతరంబు నిర్వికల్ప సమాధిం బూని యాదినారాయణుని ధ్యానింప నారాజు జన్మాంతసంచితాత్మసుకృత పరిపాకంబున నా జగదీశ్వరుండు ప్రత్యక్షమయ్యె. ఆ రమానాథునిఁ గాంచి యానందరసనమాక్రాంతచిత్తుండై సాష్టాంగ నమస్కారం

బు లాచరించి వినుతించిన నాతఁడు ప్రమోదాంతరంగుఁడై "రాజా! దివ్యవనితాలాభంబును, సుపుత్రావిర్భాతియు ఘటింపననేకాబ్దంబు ధీరాజ్యంబు పూజ్యంబుగా నేలుదు" వని వరమొసంగి యంతర్ధానుండయ్యె. మహీపాలుండు పరిపూర్ణమనోరథుండై పురమునకుం బోయెను.

ఊర్వశీరమణియవ్వసుంధరారమణు సంబంధంబునకై సంధిల్లు ప్రేమబంధంబునకుఁ జెల్లు వగచుచు, వనాంతరంబులఁ బరిభ్రమించుచుఁ గాలనిరూపణంబు దెలియక తిరిగితిరిగి వింధ్యపర్వతప్రాంతంబునఁ జైత్రరథోపమానంబగు నుద్యానవనంబుఁ జేరి నిట్టూర్పులు నిగుడించుచుఁ "గట్టా! ఆరాజశేఖరు దర్శనము లభించునని మనంబున నమ్మి యిటువచ్చి యింతదనుక వాని మోమైనఁ జూడనైతి! వలచితినని వానితో వచింతునా! ఒకవేళ ననాదరణంబు సేసిన నబ్బా! ప్రాణములతో జీవించుటెట్లు? జీవంబులఁ దృజింతునందునా! అమర్త్యనుగదా! ఈసౌందర్యమంతయు శూన్యగేహమునకెత్తిన దీపికయయ్యెఁగదా!" యని విచారించుచుండ నకారణబంధుఁడై శుకమౌళి యరుదెంచె. రాకాశశాంకోదయమున రంజిల్లు నీలోత్పలములవలె నాశుకశేఖరావలోకనంబున నామె నేత్రము లద్భుతవ్యాకోచము నొందెను. పెన్నిధిఁగన్న పేదవలె నాపైదలి లేచి యాశుకమునకు మ్రొక్కిన నతఁడు కరుణార్ద్రస్వాంతుఁడై "కాంతా! నీవింక వంతమానుము.

నీవలచిన భూపాలుం డిచటికి రాఁగలండు. నీకొక్క యుపాయం బెఱింగించెద వినుము. నీసుందరాకారంబు పటంబున స్ఫుటంబుగా వ్రాసి యారూపం బారాజీవాక్షునకు గోచరించు తెఱంగునఁ జేసిన నాతనిహృదయకుహరంబునఁ బ్రేమరసంబు వెల్లివిరియు, నీయభీష్టంబు నెఱవేఱు" సని హితోపదేశంబు చేసి వెడలిపోయె.

అంత నితాంతశిల్పకళావిశేష సంతతుల వలంతియగు నానెలంత నిజరూపంబు లిఖించి చిత్రఫలకంబుం గొనిపోయి రాజు విహారస్థానంబగు నుద్యానవనంబుననునిచె. నిరంతర వనపాలక పాలితంబగు నవ్వనంబుననున్న వనపాలకులా చిత్రఫలకంబుఁ గాంచి తీసికొనిపోయి రాజున కొసంగిరి. రాజద్దివ్యవిలాసినీ రూపంబు కన్నులారఁ గాంచి భ్రమించి యామించుబోఁడిఁగాంచినఁగాని మేనజీవంబులు నిలువంజాలవని యెంచి వనపాలకుని రప్పించి వారివలన నాచిత్తరువు దొరికిన విధమెఱింగి తదవలోకనానందచిత్తుఁడై యుండఁ జారులు వింధ్యాచల ప్రాంతంబులంగల విశేషంబు లెఱింగివచ్చి యావినోదంబులు రాజునకు విన్నవింపఁదత్సందర్శనాభిలాషుండై చనిచని యందొక్క సరోవతంసముఁ గాంచి ప్రమోదించి యంగనాజనవనాంతక్రీడ సూచించు జాడంజని శశికాంత శిలామనువేదిపై వసించియున్న యూర్వశిం గాంచి యెదురుగా నేగుదెంచె. అక్కాంత దిగ్గనలేచి నునుసిగ్గు మొ

గంబున నివ్వటిల్ల నికుంజముచాటున కేగి తదంతరంబులనుం డి తొంగితొంగి యాసుందరమూర్తిని విలోకించుచుండెను. అవనీనాథుఁ డాస్థలమునం దాసీనుఁడైయుండ మున్ను నారద మునీంద్రుఁ డమరాధిపుని కొల్వున వర్ణించిన వర్ణనావిశే షంబు లాతనియందచ్చొత్తినగతి నగుపడ నాతఁడే పురూర వచక్రవర్తి యని తలంచి

ఉ. సిగ్గును వేడ్కయుం బెరసి చీఁకటివెన్నెలలై మొగంబులో
జగ్గొకవింత సేయ నృపుసన్నిధి నొదలవాంచిమించి తా
మొగ్గితినంచుఁ దెల్పుగతి మ్రొక్కెలతాంగిపతాకయుగ్మస
మ్యగ్గరుడోపలాంకవలయాంకిత హస్తఘటల్లలాటమై."

అప్పుడయ్యింతిం గనుంగొని యపరిమితానంద చిత్తుఁడై యంత విచిత్ర విలాస రేఖ యే జవ్వనులందును గనుంగొనమ ని యుల్లిల్లూరుచుండ నారాజనిభాస్య తదాత్మిజదలేఖ్యమూ ర్తినిఁ జూచిచూచి యాఁడుదిబొంకిన గోడపెట్టినట్టన్నరీతి నాయింతి ప్రేమపూరితహృదయయయ్యు నయ్యాది పై కగు పడనీక రాజురాగరసమగ్నుండని యోజించి "మహీపాలా! నీమొగ మేనును నామొగ మీవును నెఱుంగము. రాజులు నూతన ప్రియులు. నాభావంబున కనుకూలుండవై వర్తించి నాకుంగల నియమంబులం బాటింతువేని నిన్నుం బ రిణయమగుదు" నని గంభీరంబుగాఁ బలికె. భూనాథుఁడు "మానినీ! ఆ నియమంబులెవ్వియో వచింపు మేనుతప్పక యొ నర్చెద"నని చెప్పె. అంత నక్కాంత "మహీకాంతా! నా

ఈ సురణకద్వయపోషణం బవశ్యంబైన వ్రతంబు. దుష్టమృగ చోరాది విపత్తులు పొందకుండ వీటి నెల్లప్రొద్దు దయతోఁ గాపాడుచుండవలయును. నగ్నరూపంబుననున్న నిన్నవలోకింతునేని నప్పుడే నినుఁబాసిపోఁగలదాన" నని సమయంబు చేసిన దాని కా రాజొడంబడియె. రోహిణీయుక్తుఁడగు చంద్రునింబోలె మహేంద్ర వైభవంబున రాజూర్వశీ సహితుండై పురంబునకరుదెంచి యన్యోన్య స్నేహంబున మెలంగుచుండె. అతఁడనుదినంబును సంధ్యాద్యనుష్ఠానంబులు నిర్వర్తించి, మనోజ్ఞదుకూలాదులనలంకృతుండై రాజ్యభార ధురంధరుండై యుండె. ఊర్వశియు శుద్ధాంతంబున సమస్త సౌఖ్యంబు లనుభవించుచు నొక్క నిమేషమైన నారాజు మోము చూడకయుండఁజాలక, యేండ్లు నిముసంబులుగాఁ గడపుచుండె.

కనక గోపురంబులచేతను, గనక సౌధంబులచేతను, గనక కుట్టిమంబులతోడను, గనక వేదికలచేతను, గనక కుడ్యంబులచేతను, గనక రాజీవసరోవరంబులచేతను నాకంబు ప్రకాశించుచుండు. సర్వపదార్థజన్మస్థలంబై, విశేషకల్యాణ వైభవంబునకుఁ గారణంబై, విశ్వలోకైకవినుతంబై యుండు తత్పట్టణంబునఁ దరురత్నంబు పారిజాతంబు. వనరత్నంబు నందనంబు. తురంగరత్నం బుచ్చైశ్రవంబు. గజరత్నం బైరావతంబు. రత్నరత్నంబు చింతామణి. కాంతారత్నం బూర్వశి.

ఒక్కనాఁడింద్రుఁడు తదమరావతీ సభాభ్యంతరమున మ

హా వైభవమునఁ గొలువైయుండి రత్నపరంపరల విలోకించి యూర్వశీరత్నంబుగానరామి కెంతయు వంతంగూరి యచటి గంధర్వులం బిలిచి నాఁడు భూలోకమున కంపిన యూర్వశి యింతదనుక రాకుండుటకుఁ గతంబేమని యడిగిన వారు తద్వనితా వృత్తాంతము సాంతముగాఁ దెల్ప నాదివికాంతుఁ “డేయుపాయముననైన నింక నా కోమలినిఁ దోడి తెండ”ని గంధర్వుల కాజ్ఞాపింప వారవనీస్థలి కరుదెంచి యూర్వశీ నృపాలురున్న చెలిమిఁగాంచి యొండొరులనెడఁ బాపుట కదను చూచుచుండిరి.

ఇట్లుండ నొకనాఁటి సంధ్యాసమయంబున నొక్క నదిచెంత నూర్వశీ యుర్వీధవులు విహారము సల్పి సాయంకాలమగుడు సైకతవేదికాస్థలిపై దైవయోగంబునఁ గూరుచుండిరి. పగలెల్ల శ్రమనొందియున్న వారికి వేగమే నిదుర వచ్చెను. తఱివేచియున్న గంధర్వులదియే తఱియని యెఱింగి వారి కనతిదూరంబునఁ గట్టఁబడియున్న మేషయుగంబునుఁ బట్టుకొని పోఁదొడంగ నయ్యవి భయంబునఁ గూయ నా కూఁత నూర్వశి వినినతోడన భీతిదిగ్గన లేచి “నాథా! ఉరణకంబుల నెవ్వరో దొంగిలించుకొని పోవుచుండిరి. లే లెమ్మ”ని రాజును నిద్రనుండి లేపుచుండ, గాఢనిద్రాపరవశుండగు నా ఱేఁడు లేవకుండిన నామె గనలి బిగ్గరగా “ఓరాజా! నేనెంత మొఱపెట్టినను లేవకుండు వేల? నీకు మగతనంబు లేదే?

కన్నబిడ్డలరీతి నెన్నుకొనుచున్న నాయురణకంబుల దొంగల పాల్పఱచితివా!" యని యక్కోమలి దూఱుచుండఁ దత్పరుషవచోలేశంబు వాని కర్ణరంధ్రంబుల సోకిన వ్రేటుపడ్డ పులి చందంబున దిగ్గునలేచి నిద్రాభంగముచే నేమియు నెఱుంగక జఘనజఘాద్రాజితవస్త్రుఁడై యరిగి గంధర్వులపై లంఘించి వారి నొంచి తగఁల్ల విడిపించి పట్టి తెచ్చినవిభు నూర్వశిఁగాంచి యతని మేనఁ జీర లేమి కలుషచిత్తయై "నృపాలా! హీనుని చందంబున నింత యిట్లులుకులేక యుంటివే? అలనాఁటి సమయోక్తియుఁ దలఁపవైతివి? నీతోడి స్నేహంబు నీకంత విషమయ్యెనే! నావలన నేకొఱంతయులేదు. నీవే సమయభంగ మొనరించితి" వని పలికి యక్కలికి యచ్చోటువాసి యొక్కింతయుఁ గరుణలేక యమరపురి కరిగెను. ఋణానుబంధములు కలలవంటివి గదా!

వసుమతీ కాంతుం డెంతయుఁ జింతాక్రాంతస్వాంతుఁడై భూచక్రపరిపాలనక్రియమాని, చాపాస్త్రధారణాశక్తి వీడి యేప్రొద్దుం దన్మయుఁడై యాయూర్వశీ శరీరచ్ఛాయలే తలంచుచుండె. నృపవిపన్మేఘఝంఝామారుతుండగు వసిష్ఠ మునీంద్రుఁ డాసమయంబునం దరుదెంచి రాచకార్యంబు విసర్జించి దీనుఁడైయున్న భూపాలు నవలోకించి "రాజా! శాస్త్రోక్తప్రకారం బింద్రప్రీతిగా యాగం బొనరింతువేని నీకోర్కెలీడేఱు" నని వచించిన నామునిశ్రేష్ఠుని విశిష్ట

ప్రకారంబున యాగముచేసి గోభూహిరణ్య రత్నాంబరాది నానావిధ దానంబుల విప్రులఁ దృప్తులఁజేసిన నింద్రుఁడు ప్రసన్నుండై యభీష్టవరంబు లొసంగి రాజూర్వశీబద్ధచేతస్కుండగుటఁ దెలిసి యవ్విలాసిని నతనికిచ్చి నరలోక సురలోకంబుల యథేచ్ఛావిహారంబులఁ జరించునట్లు దివ్యత్వం బొసంగి చనియె. అంతఁగొంతకాలంబున కాయింతియందుఁ బురూరవుం డాయువను కుమారునిం గనియె.

భుజాస్తంభాగ్రఘటితవిశ్వంభరాభరలాఘవిత ఫణిఫణుండును, కీర్తినర్తకీనాట్యరంగావధీకృత చక్రవాళభూధవుండును, నిశిత నిరుపమ జకర నీరజాత నిహిత నిస్త్రింశ నిర్భిన్ననిష్ఠురవైరిపలంనై వేద్యతృప్తశుంభత్ప్రితాపఘోరతరభైరవుండగు పురూరవుం డేకచ్ఛత్రమనేక వత్సరంబులు రాజ్యమేలి సర్వజనానీకంబు నానందార్ణవోత్తుంగతరంగ డోలికలఁదేలియాడఁజేసె.

---

# సగరుండు.

సీ॥ పటుశక్తి శౌర్యాలర్వాది వేవురాత్మజుల్
పనిసేయు నిమ్మహీభారముదాల్చె
ఒక్కొక్క సుతుపేర నొక్కొక్కపట్టనం
బిలయెల్లఁ గల్పించె నలఘు మహిమ
అన్నిపట్టనముల నఖిలమహారత్న
చయములుగల్గ రాజ్యంబుచేసె
పుత్రిమోహభ్రాంతిఁ బొందక మర్యాద
తొలఁగిన సుతుల నిల్ తొలఁగఁదోలె

గీ॥ చెప్పనొప్పదె? నిజపౌత్రచిత్రఘోర
తమతపోలబ్ధ గంగాంబు తరళసలిల
వీచికానూనసోపాన వితత యాన
నవనివాసత వైకుంఠనగరు సగరు"

సకలజనారాధ్యంబగు నయోధ్యాపురంబు పురంబులం దెల్ల నగ్రగణ్యంబై యుండు. అందలిం గేహంబులు తప్తహాటక ప్రభావిభవంబున మేరు భూధరంబులై, వజ్రిమౌక్తిక ప్రభా జాలంబున రజితాద్రులై, రత్నసంజనిచ్ఛటాపటలంబున రో హణాచలంబులై పొల్పెసలారు. భూసురులు శమితతామసు లై, మాత్సర్యరహితులై, యపరిమితానందులై చతురాస్యు లై, పురుషోత్తములై యొప్పుచుందురు. ఎన్నఁడు నింకిపోవని సింధువులై, బొంకి యెఱుంగనిధర్మనందనులై, శంకరునకైన లోఁబడని పార్థులై యందలి రాజకుంజరులు చెన్నలరారు

చుందురు. అందలి వైశ్యులు కోటికోట్లకొక కేతనము చొప్పున ననేక కేతనములుగల కుబేరులు. శూద్రు లనూనద యానసమృద్ధి సొభద్రులు. ఆహా! ఆపుర విభవమేమని చెప్పనొప్పు! మేడలో మెలంగని వాఁడును, మానికములేని భూషణముధరించినవాఁడును, ముత్యపు సున్నములేని విడెము వేయువాఁడు నొక్కఁడైన నవ్వీఁడునఁ గానరాఁడు. వేయేల! శృంగారంబులకు శిరోగృహంబై, ప్రాభవంబులకు వేశ్మంబై, సంపదలకు సదనంబై మంగళంబులకు మందిరంబై, సౌఖ్యసంతతులకు సద్మంబై, సత్యంబునకు శరణంబై, దానంబులకు ధామంబై యప్పురంబు భూదేవికి భూషణంబో యన నొప్పుచుండె.

అట్టి పురవరంబును బాహుకుండను మహీపాలుండు పరిపాలించుచుండెను. హైహయదేశాధీశులు బలోపేతులును మాయాన్వితులునై కపటోపాయంబున నయోధ్యానగరంబు సొచ్చి కుత్సితాహవంబున బాహుకుని నోడించి రాజ్యమంతయు నాక్రమించుకొనిరి. ఆ రాజు గర్భవతియగు సతితోడ నౌర్వు నాశ్రమంబునకుఁ బోయెను. అమాత్యులును సవతులును తదాశ్రమమునకు ననుసరించిరి. గర్భవతియగు నాకలికిం గని యీర్ష్యావేశయై యొక సవతి యామె కోదనంబునం గలిపి విషంబు పెట్టె. ఆ గరంబు గర్భస్థంబై యేడు వత్సరంబులుండు నంతకు వయోవృద్ధుఁడగు బాహుకుండు.

పరలోకగతుఁడయ్యె. ఆ యువతి గతించిన పతికై యతి సం
తాపము నొంది పతితో సహగమనంబుచేయసంసిద్ధురా
లయ్యె. అంతలో నతీతానాగతవర్తమానకాలత్రయ విజ్ఞా
నుండగు నౌర్వుండు నిజాశ్రమంబు వెలువడి వచ్చి యాసా
ధ్విని విలోకించి “ఓసచ్చరితా! ఏటికి సాదఁ జొచ్చెదవు! నీ
యుదరంబులోని యర్భకుండు దుర్భర శౌర్యోజ్వలుం డుది
తార్కసముండు. అనేక యజ్ఞంబు లొనరించి చక్రవర్తియై
యాతఁడు సకలోర్వీతలంబు నేలఁగలఁడు. నీకు శుభమ్మ”గు
నని పలుకు మునికులతిలకు పలుకుల కెంతయు నలరి మరణం
బుమాని పతికిం బరలోక క్రియలు నిర్వర్తించి యమ్మౌనీశ్వ
రు నాశ్రమభూమియందే వర్తించుచుండె. కతిపయదినంబుల
కా యువతి గరముతో నాత్మజునిం గనియె. ఔర్వుఁడు వాని
కి సగరుఁడని యర్థనామంబుంచి జాతకర్మాదిక్రియలు నిర్వ
ర్తించి పెంచి చౌలోపనయనాదు లొనరించి వేదశాస్త్రపు
రాణంబులఁ బ్రవీణునిగాఁజేసి రథాశ్వగజారోహణాదులను,
ధనురాగమంబు సాంతంబుగా నేర్పి రాజవర్తనంబుల నే కొ
అంతయుఁ గలుఁగనీకి శిక్షించె.

ఒకనాఁడు సగరుఁడు జననికడకుం బోయి “అమ్మా! మ
నమీ యడవుల నిట్లిడుమలఁ బడుచు నుండనేల? నాజనకుఁ
డెందున్నవాఁడ”ని యడిగిన నాపడఁతిమిన్న కొడుకును దొ
డపైనిడుకొని బుడబుడ కన్నీటిబొట్లురలఁ “దనయా! ఏమని

చెప్పుమను! హైహయాదులాహవంబున మీజనకుని గెలిచి సర్వ రాజ్యంబును గొల్లగొని మనల నీ ఘోరాటవులకుఁ బా అఁద్రోలిరి. అంత మీజనకుండు చింతాక్రాంతుండై కొన్ని యేండ్లిందే కాలంబు గడిపి పరలోక గతుండయ్యె" నని ప లికి మిక్కిలియు వగచుచున్న తల్లి నూరార్చి

చ॥ మదమునఁదండ్రిరాజ్యముసమస్తముఁగొన్నవిరోధివర్గముం
గదనములోనఁజంపి త్రిజగంబులఁగీర్తివెలుంగునట్లుచే
సెద! జననీ! ప్రతిజ్ఞయిదె చేకొనిహైహయవంశరాజులం
బొదివి నిశాతఘోరశరపుంజములన్వధియింతు నిప్పుడే"

అని శపథంబుచేసి యార్వుని యనుజ్ఞవడసి వానిచే దీ వనలంది యందుఁగల మునిబాలకులఁ గొందర వెంట ని డుకొని కంజాతపత్రిభవాండభాండమవియ చండంబునమ్రో యించుచు హైహయదేశంబున కరిగి యాముని బాలకుల ముందటికి ద్రొబ్బి పురప్రాంతమునందున్న రణదుందుభిని మ్రోయింపుడని వారికిఁ జెప్పి తాను తత్పట్టనమెల్లఁ గలయం గనుంగొనుచుండె. రణదుందుభిధ్వానంబులా హైహయులు విని క్రోధజ్వాలలు మిన్నుముట్ట వచ్చి సగరునిం దాకిరి. సగ రుండు బాణపరంపరల సంధించుచు నిజకార్ముకకౌశలమొప్ప, మున్ను గురుండిచ్చిన యస్త్రసంతతులఁ బ్రయోగించుచుం డెను. సగరునకు హైహయుం డెదురైన నాతఁడు కోపోద్దీపిత చిత్తుఁడై "ఓరీ! దుర్మదంబునఁ గన్నుగానక వంచనమై మా జనకు జయించి బలుమానిసివలె సిగ్గులేక రణభూమి కేతెం

చితివా! ఓభూదారా! నీబాహు[illegible]బు పెంపును, నీబంటు తనంబు సొంపును నిప్పుడ చూపింపుము”ని నిష్ఠురోక్తులాడ నాహైహయుఁడు రోషానలదగ్ధమానసుఁడై యాసగరునిపై నిశితాస్త్రనిచయంబులఁ బ్రయోగించె. లోభికి ధర్మపద్ధతులు తెల్పిన చందంబున, ఖలున కొనరించు సత్కృతులరీతి, నూషరభూమినిఁ జల్లు విత్తనములువోలె హైహయుఁడు సగరునిపైఁ బ్రయోగించు నస్త్రసంతతులు వ్యర్థములయ్యె. అస్త్రంబులు నిరస్తంబులై కైదువులు బూదిఁగలయఁజేయునదిలేక విచారించు హైహయులఁబూర్వవైరోద్రేకపూరితుఁడగు సగరుఁడు చూడకయే తఱుమసాగెను. అంతలోఁ గులగురుఁడగు వసిష్ఠుఁడు సగరు నవలోకించి ”సగరా! వీరి నిప్పుడు జీవన్మృతులను చేసితివి. ఆయుధహీనులైయున్న వీరలతో నీవు యుద్ధంబుచేసిన నధర్మంబగు. వీరిప్పుడు ప్రాణభయార్తులై నిన్ను శరణువేఁడుచున్నవారు. శరణుఁజొచ్చినవారి రక్షించుటకంటెఁ బరమధర్మంబు లేద”ని హితోపదేశంబు చేసిన నాతఁడప్పుడుకనుదెఱచి చూచి “మౌనివర్యా! కోపమనునది కాలసర్పము. తదాశీవిషపరీతుండగు వాఁడు యుక్తాయుక్తంబు లెఱుంగఁడు. నాతండ్రినిఁ బెట్టినబాధలకుఁ గోపపరీతుండనై రణంబొనరించుచు వారు శస్త్రవిహీనులౌట గుర్తింపలేనైతి. నన్ను క్షమింపుము. వీరిని రక్షించితి”నని సమాధానబఱచి వాని జ్ఞాపకంబుగా శాశ్వతప్రాయశ్చిత్తంబు వారి

గొనరింపుమని సగరుండు కోరిన వాని కోర్కెప్రకారము యవనులను ముండితోత్తమాంగులుగను, శకుల నర్ధముండితులుగను, పారదుల ప్రలంబకేశులుగను, ప్లవుల శ్మశ్రుధరులుగను, కాంభోజుల స్వాధ్యాయపరులుగను నొనరించెను. వారప్పటినుండియు నిజకులాచారవిదూరులై బ్రాహ్మణులచే విడువంబడి మ్లేచ్ఛులైరి.

సగరుండు విజయసంపన్నుఁడై సకల సచివాప్తులచే సత్కృతుండై స్వాధిష్ఠానంబునకు వచ్చి రాజ్యాభిషిక్తుండై మహీమండలంబు నేలుచుండెను. ఔర్వవసిష్ఠుల యనుమతి ననుసరించి యారాజచంద్రుఁడు వినతాకశ్యపులకుఁ దనయయగు సుమతియను వినయవతిని, విదర్భదేశాధీశ్వరు ననుంగుసుతయగు సుకేశిని వివాహంబై సుఖంబున రాజ్యమేలుచుండె.

సగరచక్రవర్తి తన భుజార్జితమైన ధనముఁదెచ్చి యాంయమెఱింగి వ్యయంబు సేయుచు ననుదినంబును భండారమును నిండారఁ జేయుచు, వర్ణాశ్రమధర్మంబులు తప్పనీక, జారచోరాదుల నడంచి, యల్పుల విన్నపములైనను నాలించుచు, బలహీనులను బలవంతులు విజృంభించి త్రోవనీక నిఖిలదేశంబులను, నిజమందిరంబు నరయుచందంబున నరయుచు నెప్పుడే యక్కఱయొదవునో యని ధాన్యంబు లాదిగాఁగల సమస్తవస్తువులను గొదవ యొదవకుండఁ బదిలపఱచుచు, మిక్కి

లి జాగరూకుండై శత్రుభూపతులుగూడ వినుతించు తెఱంగు న మెలంగుచుండె. ఆహా! వాని రాజ్యవైభవ మేమనవచ్చు! బ్రాహ్మణభూముల నాశించువారును, దేవతాద్రవ్యంబు లపహరించువారును, లంచములు మేయువారును, దుర్మదాంధత్వంబున మెలంగువారును, పేదసాముల నేలనివారును, జననీజనకుల యాజ్ఞానువర్తులై నడవనివారును నమ్మినవారిని మోసవుచ్చువారు నారాజ్యంబున మందునకైనఁ గానరారు.

అది హేమంతము. అందు సీమంతంబులకైవడి భూమినెల్లెడల మార్గంబు లనర్గళంబుగాఁ గాన్పింపఁబథికులు నిశ్శంకగా సంచరించుచుండిరి. అహములు సన్నములయ్యె. జగమెల్ల బలువగు మంచుముసుఁగులావరించె. తెరలోని యుద్ధంబు కరణిఁ దరణి గన్పట్టుచుండె. చెప్ప నశక్యంబగు చలి యుప్పతిల్లఁ దొడంగె. పద్మినీకాంతదివస దైర్ఘ్యంబు సంకుచితంబగుటంజేసి తన మనోకాంతునిఁ బెక్కు తడవుగాఁ బొందుచు నానందించు భాగ్యంబు లేమి చింతించు చందంబున సరోజబృందమ్ములు సిరిదొఱఁగి యింపుగాకుండెను. ఎల్లెడల నావరించియున్న సస్యలక్ష్మి యప్పటిచలికి సహింపఁ జాలక యవయవంబుల ముడిచిపెట్టుకొనిన తెఱంగునఁ జేలెల్లఁ గుప్పలు కుప్పలుగాఁ బడియె.

ఇట్లుండ సగరమహీపాలుండు పుత్రార్థియై యార్యునారాధింప నొక్కనాఁడా మునిచంద్రుఁడు రాజమందిరమున క

రుదెంచెను. నృపుఁ డాదరంబున వాని నాదరించిన వెన్కఁ బ్రీతుఁడై యారాజకాంతల విలోకించి "మీలో నొకసతి కొక సుతుని వేఱొక సతికి వేవురు సుతుల నొసంగువాఁడ. మీలో నెవరికేది యిష్టంబో వచింపు" డనిన నందు విదర్భనందన కులదీపకుండగు కొమరుం డొక్కండే చాలుననియె. కాశ్యపిబాహుబలాఢ్యులగు వేవురు సుతులం గోరుకొనెను. ఔర్వప్రసాదంబునం జేసి కేశికిఁ గతిపయకాలంబునకు నసమంజసుండను సుతుం డుదయించె. సుమతి కఱువదివేవురు సుతులుదయించి పెరుగుచుండిరి. బాహుబలంబును సోదరబలగంబునుఁగల నాసగరసుతు లతులదర్పితులై సాధుజనమార్గ పరిత్యాగక్రియ లొనరించియు, యాగంబులఁ జెఱిచియుఁ దపంబుల దగ్ధపఱచియు ననేక దురాత్మ్రర్గంబు లాచరించుచుండ మండలేశ్వరుండు చూచి యధగ్నోపలక్షణదారుణక్రియావిహారులగు సుతులఁ బురము వెడల నడచెను. జనులా దారుణకృత్యముల నెదనైన దలంపఁ జాలక విద్యామయుండును, భగవంతుండునగు కపిలమహామునిని శరణువేఁడిరి. అతఁడు దానికిం బ్రతీకారము సేతునని వారికి ధైర్యంబువోసి యనిపె.

సగరుఁ డశ్వమేధ సవనంబుగావింప దీక్షఁబూని యజ్ఞరక్షణార్థ మాత్మసుతుల నఱువది వేవురం బనిచె. అయ్యధ్వరంబు నూఱవదియగుచు నిర్జరాధీశ్వరుపంపున నొక యనిమిషదూత యేతెంచి యానరనాథ తనూభవుల కనుఁబ్రా

మి యజ్ఞతురంగంబును భూబిలంబునకుం గొనిపోయి నాగలోకంబున ఘోరతపం బూనియున్న కపిలముని యాశ్రమభూమియందుఁ గట్టి వెడలిపోయెను. రాట్సుతు లాతురంగమును గానక కోపంబున నొక్కొక్కఁ డొక్కొక్క యోజనము రవడి భూమిఁద్రివ్వి పన్నగలోకంబంతయుఁ దిరుగుచు నీశానభాగంబున శరత్కాల దివాకరునిపోలె వెలుంగు కపిలమునీంద్రునిం గాంచి వాని సమీపమునందుఁ గట్టఁబడియున్న యధ్వరాశ్వంబుఁ గని సాయుధహస్తులై వాని వేధింపఁ దొడంగిరి. అమహాత్ముని గినిసి యగ్నికీలలఁ గ్రమ్ము వీక్షణంబుల వారిపైఁ బ్రసరింపఁజేసిన వారెల్ల రొక్కట మొగి భస్మమైరి. పాపకర్ములై జనుల కుపద్రవములు సలుపువారల దైవంబు చెఱుచుఁగదా!

సగరుం డావార్త విని శోకాంబుధి మునిఁగి, యధ్వరాశ్వంబుఁ గొనితేర నసమంజస సుతుండగు నంశుమంతునిఁ బంపిన నా వినయరాశి సగరసుతులు మును చనిన మార్గంబునఁ జని కపిలమౌని సందర్శించి వాని కరుణకుఁ బాత్రుండై యాతఁడా యాగతురగంబునిచ్చిన సార్థచిత్తుండై "మౌనిచంద్రమా! మత్పితృవర్గంబునకు స్వర్గప్రాప్తికరంబైన వరంబు ననుగ్రహింపఁ గదే" యని వేఁడిన యామునియనుగ్రహించి యిట్లనియె.

శా॥ నీపౌత్రుండు భగీరథుండతి తపోనిష్ఠాపరుండై త్రిలో
కీపూతంబగు వేల్పుటేటి నిలకుం దెలంగించుం దదీయాంబువుల్
పైపైఁ బర్వఁగ నస్థిభస్మములకున్ స్నానంబగున్ నీపిత్రు
ల్పాపాలాపవికింగలంగులు నిరాశ్వర్గప్రసాభోగ్యస్నతుల్"

అంశుమంతుఁడు సంతోషితస్వాంతుఁడై మునికి ముదంబున మ్రొక్కి వానికడ సెలవుగైకొని యధ్వరాశ్వము గొనివచ్చి పితామహునకిచ్చి యజ్ఞంబు పరిపూర్తి చేయించె. జలధి నాఁటనుండి సాగరుండను పేర వినుతికెక్కె. సగరతనయుఁడయ్యె. సగరు పరోక్షంబున నంశుమంతుండు రాజ్యాభిషిక్తుండయ్యె. వానికి దిలీపుండు పుట్టె. అతనికి భగీరథుండు జన్మించె. అతఁడు దినదిన ప్రవర్ధమానగాత్రుఁడై యన్నివిద్యలయందారితేరి యొకనాఁడు కపిల కోపాగ్నిదగ్ధులై యధోగతి నొందియున్న పితృపితృవ్యుల భస్మరాసులం గాంచి కడుంగడు విచారించి, గంగను దెత్తునని ప్రతిజ్ఞచేసి కైలాసంబునకేగి యీశ్వరునిఁ బండ్రెండు వత్సరంబు లంతరాయంబులేక ప్రార్థింప నతఁడు ప్రత్యక్షంబై "భగీరథా! ఏను విష్ణుపాదప్రక్షాళనంబు చేసితి. ఆ గంగను కమలగర్భుఁడు తన కమండలువున ధరించె. నీవాతనిఁ గూర్చి తపంబు నేయుదేని నీయిష్టార్థంబగు"నని యానతిచ్చె.

భగీరథుండు పితామహునిం గూర్చి చాలకాలంబు తపంబునేయ బ్రహ్మ ప్రత్యక్షంబై "రాజా! తొల్లి వైకుంఠుండు త్రివిక్రమావతారుండై యొక్కపాదంబున నంబరం బాక్రమించె. అప్పుడే నతని పాదంబుఁ గడుగు తఱిఁ దదంగుష్ఠనఖంబున నిమిడియుంట నిచ్చట గంగ లే దచ్చటకుఁ బొమ్మ"ని వచించె. పాపమా భగీరథుఁ డచ్చట విఫలమనోరథుండ

య్యును, పట్టినపట్టు వదలక నిరాహారుఁడై నారాయణునిఁ గూర్చి యనేక వత్సరంబులు మహాతపంబు చేసిన వైకుంఠుం డు ప్రత్యక్షమై యతని భక్తికి మెచ్చి యొక్క గంగాబిందు వొసంగి తిరోహితుండయ్యె. ఎవ్వరే నతిప్రయత్నము చేసి కొనసాగించుకొనిన కార్యంబున కిప్పటికిని భగీరథ ప్రయ త్నమనుటయుం గలదు.

భగీరథుఁడు సంతుష్టాంతరంగుఁడై యావైకుంఠుని భక్తి పరవశత్వంబునఁ బొగడఁ దొడంగె. గంగ భగీరథునిం గని "ఓరాజేంద్రా! నీవేమార్గంబున నడిచిన నామార్గంబున వ చ్చెద. ముందు నడువు" మని యాజ్ఞాపింప నాతఁడు నడిచి పోఁదొడంగె. అట్లాతఁడు కొంత దవ్వేగుసరికి మేరు వడ్డంబ య్యె. భగీరథుఁడు చేయునదిలేక మిక్కిలి విచారించి యెట్ట కేల నైరావతంబును బ్రార్థింప వాని ప్రార్థన నంగీకరించి య గ్గజంబువచ్చి తన నిశితపీవరరదన ద్వయంబున నాహేమాద్రి నిఁ బండ్రెండు వత్సరంబులు ప్రహరించిన యా మహీధ్రశృం గం బొక్కటి ముక్కలయ్యె. అంత నామార్గంబున గంగ వెలువడి యొక ధార మందాకినియయ్యె. ఒకధార పాతాళ గంగయయ్యె. ఒకధార భగీరథుని వెంటనంటి పుడమి కే తెంచి యాసగరపుత్రులపైఁ బ్రవహించి స్వర్లోకవాసులం జేసె.

ఆహా! గంగామాహాత్మ్యము నెవ్వఁడు గొనియాడఁగలఁడు!

కం. గంగానది గంగానది
గంగానదియనుచు జేపకడ మేల్కనుచో
గంగఁగొనియాడు నెవ్వఁడు
భంగించు నతండు ఘోరపాతకచయముల్."

సీ. భాగీరథీస్నానపరతఁ బోలంగలే
దామ్నాయశాస్త్రాగమాధ్యయనము
వాలాయమును మనోవాక్కాయ దురితాళి
విదళించు గంగాభివీక్షణంబు
శ్రీకంఠు కృపలేక సిద్ధింపనేరదు
త్రిదశ గంగానదీ తీరవసతి
బ్రహ్మవిజ్ఞానసంప్రాప్తి హేతువు
జహ్నుకన్యాసింధుసలిలసేవ

గీ. కలియుగంబునఁ గలుషచిత్తులకు శఠుల
కన్య విత్తాపహర్తల కనియతులకు
నాత్మయందుఁ బ్రాయశ్చిత్త మాచరింపఁ
గాంక్షగలయట్టి నరులకు గంగ దక్క."



# కార్తవీర్యార్జునుఁడు.

సీ. హేహయవంశ ధాత్రీశాబ్ధిచంద్రుఁడై
జనియించి విశ్వభూచక్రమేలె
అచ్యుతమూర్తి దత్తాత్రేయయోగీంద్రు
చేత జగజ్జైత్ర సిద్ధివడసె
ఏతప్పు నెన్నఁడు నెవ్వరు నెచ్చోటఁ
దలపరాకుండంగ నిలిపె నాజ్ఞ
ఏడు దీవులయందు నెన్నూరుహయమేధ
యాగంబు లొనరించె నలఘు మహిమ
గీ. అతులతరదీర్ఘ సత్వ సహస్రబాహుఁ
డహిగణాధిపఫణ గణాయత్తభూరి
భూభరము దాల్చె నవలీలఁ బొగడఁ దగదె?
కార్తవీర్యార్జునాహ్వయక్ష్మాతలేంద్రుఁ."

త్రొల్లి విదోషుండును నయోదారమనీషుండునగు నంబరీషుని సంరక్షించి వచ్చి శ్రీమన్నారాయణుండు గలశాంభోరాశి మధ్యంబునఁ గుండలికుండలీంద్ర శయ్యపైఁ బవ్వళించియుండ మునిబిడౌజు లనేకులు వచ్చి వాని శౌర్యాదిగుణంబుల వినుతించుచుండిరి. వారిలోఁ గొందఱు "మహాత్మా! నీ చక్రంబు నిర్వక్రపరాక్రమంబై కాలానలసన్నిభంబైన" దని పొగడఁ దొడంగిరి. ఆ స్తోత్రంబుల కాచక్ర ముప్పొంగి తాను లేకున్న శ్రీమన్నారాయణు పని సున్నయని గర్వించి కించిన్నిరసనంబున "మునులారా! నానిశితసహస్రముఖంబుల నరిప్ర

ముఖుల నుఱుమాడి మా దేవరకు జయంబొనఁ గూర్చుచుం టినికదా!" యని పలుకు పలుకు లాదుర్వారగర్వనిర్వానసనా బద్ధకంఠుండగు నారాయణుండు సమరభోజన ప్రయోజన విశారదుండగు నారదునకుఁ గనుసన్న యొనర్ప నాతఁడు చూచి వానియంతరంగంబు నెఱింగి దిగ్గున లేచి "సుదర్శనా! అంతయు నీప్రయోజకత్వమే యని గర్వించెద వేల? శ్రీమన్నా రాయణుని చెట్టఁబట్టుటంగదా నీకిట్టి యౌన్నత్యంబు గల్గుట. లేకున్న నీవొక్కఁడ వే మొనర్పఁగల"వని పరిహాసించు నార దుని పలుకులు చక్రమునకు ములుకులై తోపఁగోపసంరం భంబున "నోముని ముచ్చా! మీదేవర నే లేనిదే యేమి చేయునో చూచెదవులే! నాసహస్రముఖంబులు సహస్రబా హుదండంబులుగా నొనర్చి మీయల్పబాహుని పొంక మడం పకున్న నే చక్రిహ్వ యుండనే" యని గద్దించి పలికెను. నారాయణుండును గ్రోధంబున "నోరీ! గర్వాంధా! నీసహ స్రబాహువులను నాయొక్క బాహువుచే ఖండింపకున్న నన్నీ నామంబునం బిలువకు" మని శపథంబు సేసె. చక్రము గ్రోధమువహించి తటాలున వాని వీడి చనియె.

శ్రీమన్నారాయణుండు పరశురాముఁడై చక్రము కార్త వీర్యార్జునుఁడై జన్మించెనని చెప్పుదురు. ఏదియెట్లున్నను గార్త వీర్యార్జునుఁడు సహస్రబాహులు గలవాఁడై క్ష్మాచక్రమెల్ల జనుఁ లంత రోహాయని కొనియాడున ట్లేలి యొక్కచేదో యి వానిచే నిహతుఁడయ్యె.

హైహయవంశంబునం దుద్భవించిన కనకుఁడను భూకాం తునకుఁ గృతవీర్యుండను సుతుఁడుద్భవించె. సహస్రధారాశో

భితంబగు సుదర్శనాంశవలనఁ గృతవీర్యునకు సహస్రబాహు సమన్వితుండగు కార్తవీర్యార్జునుం డుదయించె. అధికప్రతాప సమన్వితుఁడగు నాతఁడు పెద్దయి వెనుక రాజ్యరమను భుజాపీఠంబున నలంకరించి సప్తద్వీపపరివృతావనీతలంబెల్లఁ జక్కఁగాఁ బరిపాలించె. అత్రి సముద్భవుండును, హరిహరబ్రహ్మవంశ సంజనితుండునగు దత్తాత్రేయునిఁ బ్రసన్నునిఁ గావించుకొని యాతనిచే నెవ్వరేనాఁ డజయుని మహావరములఁ బడసె.

వాని రాజ్యపరిపాలనా వైఖరి యొక్కఁడభివర్ణించుట కలవి కాదు! కార్తవీర్యార్జునఁ డొకనాఁడు సామంతామాత్యాది పరివేష్టితుండై రాజకీయవ్యవహారంబులఁ జక్కఁ దిద్దుచు వనాశ్రమవాసులగు బీదతాపసుల కొక్క పన్ను విధించెను. వారది విని ఘనకోపపరీతాత్ములై "వనంబులఁ గందమూలఫలంబు లేఱుకొని తిను మాకీ పన్ను విధించు టేల" యని యందఱొక్కుమ్మడి జమదగ్నితో రాజును దండింపఁ బదంపడి వచ్చిరి. ఆసమయంబున రాజు స్నానసంధ్యాద్యనుష్ఠానము లాచరించి నియమనిష్ఠుఁడై దత్తాత్రేయు నర్చించుచుండెను. అయ్యవసరంబునను వాని భుజమున నొక యమ్ములపొదియునందు నిశితబాణసందోహంబును బ్రకాశించుచుండె. తపోనిష్ఠాగరిష్ఠుండగు [illegible] ముంగల మునులందఱుఁ గూర్చుండి [illegible] చాలించిన వెనుక వారి రాకకుఁ గారణం బెఱింగిన సంసిద్ధుఁడై యుండెను. అంతలో, ఆహా! వాని పరిపాలనాశక్తి నేమనవచ్చు—వాని భుజమున వ్రేలు తూణీరము నుండి యొక్క బాణము తటాలున లేచి ధగధగద్ద్యుతులతోఁ రివ్వున నెచ్చటికో యెగసి

ముఖుల నుఱుమాడి మా దేవరకు జయంబొనఁ గూర్చుచుం టినికదా!" యని పలుకు పలుకు లాదుర్వారగర్వనిర్వాసనా బద్ధకంకణుండగు నారాయణుండు సమరభోజన ప్రయోజన విశారదుండగు నారదునకుఁ గనుసన్న యొనర్ప నాతఁడు చూచి వానియంతరంగంబు నెఱింగి దిగ్గున లేచి "సుదర్శనా! అంతయు నీప్రయోజకత్వమే యని గర్వించెదవేల? శ్రీమన్నా రాయణుని చెట్టఁబట్టుటంగదా నీకిట్టి యౌన్నత్యంబు గల్గుట. లేకున్న నీవొక్కఁడ వే మొనర్పఁగల"వని పరిహాసించు నార దుని పలుకులు చక్రమునకు ములుకులై తోపఁగోపసంరం భంబున "నోముని ప్రముఖా! మీదేవర నే లేనిదే యేమి చేయునో చూచెదవులే! నాసహస్రముఖంబులు సహస్రబా హుదండంబులుగా నొనర్చి మీయల్పబాహుని పొంక మడం పకున్న నే చక్రిహ్వయుండనే" యని గద్దించి పలికెను. నారాయణుండును గ్రోధంబున "నోరీ! గర్వాంధా! నీసహ స్రబాహువులను నాయొక్క బాహువుచే ఖండింపకున్న నన్నీ నామంబునం బిలువకు" మని శపథంబు సేసె. చక్రము గ్రోధమువహించి తటాలున వాని వీడి చనియె.

శ్రీమన్నారాయణుండు పరశురాముఁడై చక్రము కార్త వీర్యార్జునుఁడై జన్మించెనని చెప్పుదురు. ఏదియెట్లున్నను గార్త వీర్యార్జునుఁడు సహస్రబాహులు గలవాఁడై క్ష్మాచక్రమెల్ల జనుఁగొన రోహిణాయని కొనియాడున ట్లేలి యొక్కచేదో యి వానిచే నిహతుఁడయ్యె.

హైహయవంశంబునం దుద్భవించిన కనకుఁడను భూకాం తునకుఁ గృతవీర్యుండను సుతుఁడుద్భవించె. సహస్రధారాశో

భితంబగు సుదర్శనాంశవలనఁ గృతవీర్యునకు సహస్రబాహు సమన్వితుండగు కార్తవీర్యార్జునుఁ డుదయించె. అధికప్రతాప సమన్వితుఁడగు నాతఁడు తండ్రి వెనుక రాజ్యరమను భుజాపీఠంబున నలంకరించి సప్తద్వీపపరివృతావనీతలంబెల్లఁ జక్కగాఁ బరిపాలించె. అత్రి సముద్భవుఁడును, హరిహరబ్రహ్మవంశ సంజనితుండునగు దత్తాత్రేయునిఁ బ్రసన్నునిఁ గావించుకొని యాతనిచే నెన్నేనాఁడు వలయుని మహావరములఁ బడసె.

వాని రాజ్యపరిపాలనా వైభవ మిట్టి దని చెప్పఁజాలుట కలవి కాదు! కార్తవీర్యార్జునుఁ డొకనాఁడు సామంతామాత్యాది పరివేష్టితుండై రాజకీయవ్యవహారంబులఁ జక్క దిద్దుచు వనాశ్రమవాసులగు బీదతాపసుల కొక క్రొత్త పన్ను విధించెను. వా రది విని ఘనకోప పరీతాత్ములై "వనంబులఁ గందమూలఫలంబు లేఱుకొని తిను మాకీ పన్ను విధించు టేల" యని యందఱొక్కుమ్మడి బయలుదేరి రాజును దండింపఁ బదంపడి వచ్చిరి. ఆసమయంబున రాజు స్నానసంధ్యాద్యనుష్ఠానము లాచరించి నియమనిష్ఠుఁడై దత్తాత్రేయు నర్చించుచుండెను. అన్యావసరంబునను వాని భుజంబున నొక యమ్ములపొదియునందు నిశితశాణసన్నాహంబులు ప్రకాశించుచుండె. తపోనిష్ఠాగరిష్ఠులైన యా ముసలిముసలి ముంగల మునులందఱుఁ గూర్చుండి వారి గొంతెత్తి వాదించిన నెనుక వారి రాజకుఁ గారణంబెఱింగింప సంసిద్ధులై యుండిరి. అంతలో, ఆహా! వాని పరిపాలనాశక్తి నేమనవచ్చు—వాని భుజమున వ్రేలు తూణీరము నుండి యొక్క బాణము తటాలున లేచి ధగధగద్ద్యుతులతో రివ్వున నెచ్చటికో మొగసి

పోయి తనుతరకాలంబుననే రక్తసిక్తాగ్రభాగంబుతో వచ్చి యాయమ్ములపొదిఁ బ్రవేశించె. ఆ మునులది చూచియు నేమియు గ్రహింప నేరకూరకుండిరి. కొంతవడి కారాజేంద్రుఁడు తపము చాలించి గుమిగూడియున్న మునుల నవలోకించి వినయ వినమ్రుఁడై వారందఱకును మ్రొక్కి నిలువంబడిన నెవ్వరును గూడ నాశీర్వచన సూచన వాచికాలేశంబులైనఁ బల్కరు సరిగదా వికలముఖులై "రాజా! నీవు ధర్మపరిపాలనాసక్తుఁడవని వినియుంటిమి. నీ కిదేటి ధర్మ మేటి న్యాయము! పన్ను మొగం బెఱుఁగని మాపై నరిగట్టితివి. పూర్వభూమీశు లెవ్వరు నీపాటి ధీశాలురుగారో" యని కఠినముగాఁ బల్కి నించుకయు నల్క వహింపక భూపాలుం డది యుక్తమే యని నచించి వెడలిపోయెను. అఖండతపోమండితులగు మునిశండాలురు ఖండిత మనోరథులై నిజాశ్రమములకడ కరుదెంచిరి. అప్పుడు మునిభార్య లెల్లను భర్తలం గౌఁగలించుకొని "నాథా! ఇంట నెవ్వరు లేని సమయంబున నింతకుమున్ను, చండతరాస్యమండలముతోఁ గరాళవక్త్రంబుతో నిశితదంష్ట్రాయుగంబుతో సర్వజన భయంకరంబగు నొక వికృతమృగం బరుదెంచి మన పిల్లలను చంపఁద్వరపడుచుండ నంతలో నెచ్చటనుండియో యొక బాణము వచ్చి దానిని సంహరించి యెగిరిపోయెను. ఇంతకు నేఁడు మనము లేచినవేళ మంచిద"ని చెప్పి యామృగమృతకళేబరమును జూప మునులు భయభ్రాంతులై యాబాణము తొల్లిరాజు తూణంబునఁ జొచ్చిన బాణమే యని తెలిసికొని రాజును రాజ్యపరిపాలనావైఖరిని వేనోళ్లం బొగడుచు వానిని నిం

దఱును బయలుదేరి వన్యపారితోషికంబులతో రాజును స
మీపించి తమ తప్పు క్షమింప వేఁడుకొని "పైసకాదు పది
పైసలు పన్నిచ్చినను మీబుణము తీర్చుకొనలేమని" విన్న
వించి సర్వలోకంబును గంటికి రెప్పవలెఁ గాచుచున్న వాని
ని దీవించి సంతోషంబునం జనిరి. ఆహా! రాజన్న కార్తవీ
ర్యార్జునుఁడే గదా రాజు!

ఒకనాఁడా యువనీపాలుఁ డంగనానిచయంబుతో రేవా
నది కేగి యందు జలకంబులాడి నిజకరాబ్జంబుల నానదీ
నీరంబుల నడ్డుగట్టె. ఆ సమయంబున లంకేశుండు తన్నదీసిక
తాతలంబున నొక సైకతలింగమును నిల్పించి పూజించుచుం
డ బాహుసహస్రముచేఁ ద్రోయఁబడిన నీరంపుజల్లులా పౌల
స్త్యుని లింగమును సమీపించి ముంచి దూరంబు పోవుమా
పె. రావణుఁడు తత్కారణంబునఁ గినిసి భ్రూకుటి దుర్నిరీ
క్ష్యుఁడై యక్షణమ పురంబు సొచ్చి వలయము సేయ దో[illegible]
ని మాహిష్మతీపురముఖంబై దాడివెడలి జయభేరి మ్రోయించినఁ
బరాక్రమోపార్జనుండగు కార్తవీర్యార్జునుండు సైన్య మపే
క్షింపకయే రావణునిఁ దత్సైన్యమును మార్కొని హరిణ
ములపైఁ గవియు హర్యక్షంబు వగిదిఁ గవిసి క్షణములో
సైన్యమును నాశనముచేసి రావణునిఁ బట్టి రెక్కలు విఱిచి
కట్టి కారాగారంబున బంధించివేసెను. అంతం గొంతకాలం
బునకుఁ బులస్త్యుఁడు పుత్రుని దుస్థితికి వగచి వాని విడిపిం
చు శక్తి లేమి మాహిష్మతీ పురంబున కేగి యామహీపాలు
నిఁ బ్రార్థింపఁ గరుణాసముద్రుఁడగు నాతండు రావణుని విడి
చి పుచ్చె.

కార్తవీర్యుఁడు ధర్మమార్గానుసరుఁడనియు, వితరణగుణాలంకృతుఁడనియు విని యొకనాఁడు హవ్యవాహనుఁడు దన కాహారము గావలయునని వానిఁ బ్రార్థించెను. అడుగుటే తడవుగా గిరినగరారణ్యమంతయు భక్షింపుమని తేఁడానతిచ్చె. తత్కాననప్రదేశమున మైత్రావరుణుని యాశ్రమం బొండుగలదు. దహనుఁ డాయాశ్రమంబునుగూడ దహించిన మైత్రావరుణుఁ డలిగి కార్తవీర్యుఁ డొనర్చిన దుస్తంత్రమిదియని యెంచి వాని బాహుసహస్రమును బరశురాముఁడు ఖండించుఁ గాకయని శపించెను.

భూవిభుం డొకనాఁడు దైవయోగంబున విపినాంతరసీమల వేఁటకై తిరిగి తిరిగి యాఁకట సొలుచు శ్రాంతశరీరుఁడై జమదగ్నిముని యాశ్రమముఁ జేరి మ్రొక్కిన నామునీంద్రుఁ డారాజేంద్రుని బూజించి తన హోమధేనువును రప్పించి యన్నను, నతని సైన్యమునుగూడ నిష్టమృష్టాన్నముల సంతుష్టులం జేసినఁ దత్ప్రయత్నంబుల కాతఁడు విస్మయచేతస్కుఁడై యాకామగవి నిమ్మని మునిచంద్రు నర్థించె. అందుల కాతఁ డొడంబడమి పుడమిఱేఁడు పొడమిన కోపగర్వసంరంభము వలన నొద్ద భటుల నొద్దికమీఱఁ జీరి "యోరీ! మీరీ బాపనయ్య నొప్పించి యాధేనువును గొని రండ"ని యాజ్ఞాపించి మాహిష్మతీ పురమున కరుదెంచెను. భటులు ముని నదలించియు, హుంకరించియు, దండించియు నామొరపు నొసంగుమనిరి గాని యాతఁ డద్దాని వీడకుండుటఁ గని కోపంబున నాని కుత్తుక నుత్తరించి యాధేనువునుబట్టి లాగుకొని పోయిరి.

ఆ సమయంబునఁ గుశసమిత్ఫల పుష్పచయంబులం గొని తేరఁ గాంతారాంతరంబులకుం బోయియుండిన పరశురాముఁడు కొంతవడి కాశ్రమము సమీపించి తద్వృత్తాంతమం తయు విని మాహిష్మతీ పురంబున కరుగఁ దలంచి

సీ. ఉదయార్క బింబంబు నదలించు పటుకోప
　　పాటలేక్షణ పరంపరలు నిగుడ
నది కతమ్ముగ నేఁడు నవసీంద్రి గళగళ
　　దుద్ధిరార్ద్రి మైనట్లు స్వధితి మెఱయ
భువనమ్ములకు నుపద్రవము వెండియుఁ దెల్పు
　　వేఁడి యూర్పులగాడ్పు విసరుచుండ
హారిదంతములుముట్టు జ్యాఘోషణము తోడి
　　బాణాసనము కేలఁ బదిలపడఁగ

గీ. దరియ నరుదెంచె నటకు దుర్దమబలుండు
క్షణవినోద గృహీతలోకత్రియుండు
భృగుకులాంభోధి సంపూర్ణ మృగధరుండు
చిత్రచరితుండు జమదగ్ని పుత్త్రకుండు."

ఆ చందంబున మాహిష్మతీపురంబుఁ జేరి నిలుచున్న సమయంబునఁ గార్తవీర్యుఁడు కాలాంతకునిభంగి విజృంభించు పరశురామునిం గని సెలవివాఱ నవ్వి "విస్మయనీయశీలా!

ఉ. పాడుకుఠార ఖడ్గమేడ, ఘన బాడబవంశమ దేడ, మర్మముల్
గాడెడు చాపమేడ, విమలంబగుశీలమ దేడ, నెత్తురుల్
దోడు రణాంగణప్రకర దుర్భరశస్త్ర విహారమేడఁ బా
లోడు కుశపవిత్రముల నొప్పు కుటీరము దేడ, భార్గవా!"

అని గేలిగొట్టు కార్తవీర్యునిపై మఱల విజృంభించి "ఓరీ! వాచాటా! ఇయ్యది బ్రహ్మక్షత్రాత్మకంబగు మిశ్రాకారమని యెఱుంగవా!" యని చండకోదండగుణటంకారంబులం బఱప రణదోర్దండ బలప్రచండుఁడగు కార్తవీర్యార్జునుండు నిశితబాణపరంపరల నారించి పావకాస్త్రంబు వానిపై నిగుడింప రాముఁడు వారుణాస్త్రమునఁ దాని నడచి పన్నగాస్త్రంబేయఁ గృతవీర్యతనయుఁడు దానిని గారుడంబుచే నంతమొందించెను. జమదగ్నిసుతుఁడు నతిక్రోధఘూర్ణితమానసుఁడై యొక్క శక్తి వైచినఁ దచ్ఛక్తికిఁ గార్తవీర్యుఁడు మూర్ఛనొంది కొంతదడవునకుఁ దెలిసి లేచి సహస్రకరంబుల నప్పళించుచు హుంకరించి మఱల యుద్ధంబునకురా రాముఁడది చూచి బాణవర్షంబుఁ గురిపించె. ఆచందంబున వారిరువురుఁ గొండకొండెన, హరిహరిసిఁ గొఱికొని అనిఁ దాఁకిన విధంబునం దాఁకి ఘోరసంగ్రామంబు నెఱపుచున్నతఱి నింద్రుండు వజ్రాయుధంబుచేఁ గొండరెక్కలఁ జెండుభంగి మదించిన యేనుఁగు గున్న యిక్షుదండంబుల విఱుచు కరణి రాముఁడు గార్తవీర్యుని కరంబుల నఱకి మస్తకంబుఁ ద్రుంచె. తత్కబంధంబునుండి మార్తాండమండల సదృశంబగు దివ్యతేజఃపుంజంబు విష్ణుపదంబున కరిగె.

## సంపూర్ణము

